




వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత. ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండీ మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికీ ఆత్మబంధువు లాటిది.

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళనాడుకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

---



భారతీయ గృహలక్ష్మివలెనే అమెరికన్ గృహిణికూడా అతిథులను ఆదరించటంలో అతి ఉత్సాహంచూపుతుంది. న్యూయార్క్‌లో చదువుకొంటున్న ఒక భారత విద్యార్థి (రాజేంద్రనాథ్ బారా) తనతోడి విద్యార్థి ఇంటికి అతిథిగా వెళ్లగా ఆ విద్యార్థి తల్లి ఎంతో ఆప్యాయంగా ఆదరించినప్పటి చిత్రం




జయజయ గృహలక్ష్మి స్త్రీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతీమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య



# సహవిద్య



ఉన్నత విద్యాలయాలలో సహవిద్యవలన విద్యార్థులు అధికంగా పరీక్షలు తప్పుతున్నారన్న అభిప్రాయం పూర్తిగా త్రోసివేయతగింది కాదు. విద్యార్థులలో విద్యా విజ్ఞానాలపట్ల ఆసక్తి తగ్గుదల, కృషిలోపం పరీక్షలలో తప్పుటకుగల కారణాలలో కొన్ని. దాంతోబాటు తల్లిదండ్రులు తమ బిడ్డల విద్యా పురోభివృద్ధిపట్ల వారి నడవడిపట్ల ఆసక్తితో గమనించి సరిదిద్దకపోవడం కూడ పరీక్షలలో తప్పుటకు కారణము. ఇంకా తక్కువమంది ఉపాధ్యాయులను వినియోగించి ఎక్కువమంది విద్యార్థులకు చదువు చెప్పించే పద్ధతికూడ పరీక్షాఫలితాల లోపానికి కారణము.

ఇక సహవిద్యవలన ఫలితాలను పరిశీలించినచో విద్యార్థుల దృష్టి చదువుపట్ల కాక మరొకలాగ పరిణమించడం సహజమగుచున్నది. ఇది బాలబాలిక లిరువురి విద్యాభ్యాసమునకు అంతరాయముగా నున్నది. అధిక సంఖ్యాకులుగానున్న బాలురు అల్పసంఖ్యాకులుగానున్న బాలికలను అల్లరిచిల్లరగా వేధిస్తున్న సంఘటనలు అనేకం.

సహవిద్య క్రమశిక్షణారాహిత్యానికి, పరీక్షలలో తప్పుటకు ఏకైక కారణము కాక పోయినా చదువు కుంటుబడటానికి, క్రమశిక్షణ లోపానికి సహవిద్య అనేకసార్లు కారణ మగుచుండుట కలదు.

ఇదే సందర్భమున సహవిద్యకు స్వస్తి చెప్పవలసిన ఆవశ్యకత యితరత్రాకూడ కలదు. బాలురకు, బాలికలకు విడివిడిగా ఉపయుక్తమయిన విద్యావిధానము రూపొంది సుశిక్షితులు కావాలి. బాలబాలిక లిరువురి విద్యావిజ్ఞానములు గుమాస్తాలగుటకు మాత్రము వినియోగపడితే మొత్తంగా నిరుద్యోగ వ్యాప్తి, కుటుంబ జీవనంలో లోట్లు, సంఘజీవనంలో అవకతవకలు పెచ్చుపెరుగగలవు. ఉన్నత పాఠశాలల నుండియే సహజంగా శక్తిసామర్థ్యముల కనుగుణంగాను, అవసరముల కనుగుణంగాను బాలురు, బాలికలు విద్య నభ్యసించి బాధ్యతల నిర్వహించుటకు సుశిక్షితులు కావాలి. అందుకు అనువైన విద్యావిధానములతో బాలికలకు, బాలురకు వేర్వేరు విద్యాలయము లమరుట మున్ముందుకి వాంఛనీయము. బాలురు, బాలికలు కూడ ఆసక్తితో విద్యావిజ్ఞానముల పట్ల దృష్టి కేంద్రీకరించుటకు సహవిద్య అంచలవారీగా నిషేధించడం మంచిది.

అయితే సహవిద్యకు స్వస్తిచెప్పు సందర్భమున కొన్ని యిబ్బందులున్నమాట వాస్తవమే. ముఖ్యంగా తగినన్ని ఉన్నత పాఠశాలలు లేకపోవడం, ఆడపిల్లలకు అన్ని చోట్ల ప్రత్యేకంగా పాఠశాలలు లేకపోవడం, ట్రెయినింగయిన అధ్యాపకుల కొరత ఉన్నవి. అయినా క్రమంగా సంఘ పురోభివృద్ధి నుద్దేశించి, క్రమశిక్షణ నుద్దేశించి, బాలబాలికలకు విడివిడిగా పాఠశాలలేర్పడి, వారి కనువైన సుశిక్షణ, విద్యలు గరప బడటం వాంఛనీయము.

----------

# సంతాప సానుభూతులు

సుప్రసిద్ధ దేశభక్తుడు, నాయకశ్రేణికి చెందిన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారి నిర్యాణము చాల విచారకరమైనది. ఆయన చిత్తశుద్ధి, ప్రజాసేవ పేర్కొన వలసినవి.

శ్రీ సర్వోత్తమరావుగారు స్వాతంత్ర్య సమరయోధులు, ఇరవై సంవత్సరాలుగా దక్షిణ భారతంలో వయోజన విద్యావ్యాప్తికి, గ్రామీణ గ్రంథాలయోద్యమ విస్తరణకు నిర్విరామముగా కృషిచేసినవారు. ప్రప్రథమంలో ఆంధ్రపత్రికకు సంపాదకత్వము నిర్వహించారు. తర్వాత 'స్వరాజ్య' పత్రిక సంపాదకవర్గంలో పనిచేశారు. సమర్థులైన గ్రంథకర్త కూడాను.

ఉత్తమ ఆదర్శ లక్ష్యాలతో ప్రజాసేవకు, దేశసేవకు తన జీవితమును శ్రీసర్వోత్తమ రావుగారు అంకితము చేశారు. స్వాతంత్ర్యోద్యమంలోనే కాక ఆంధ్రరాష్ట్రోద్యమంలో సయితం వీరు ప్రముఖపాత్ర నిర్వహించారు. వీరి ఏకైక పుత్రికకు, వారి కుటుంబానికి మా సానుభూతి సంతాపములను తెలుపుచున్నాము.

# పసుపు మాలచ్చి

"సస్యశ్రీ"

పసిడిపంటల తల్లి, పసుపు మాలచ్చి,
హసియింపు మా చేల పసియింప వచ్చి.
పెద్దముత్తయిదువవు, పెరటి పెన్నిధివి
పండి పాలింపవే మెండు సిరులిచ్చి.

నిత్యకల్యాణమ్మ నీవున్న వీట;
పచ్చతోరణ మమ్మ నిచ్చలచోట
సర్వమంగళ గౌరి! స్వాగతము మాత:
శోభన దేవతా! చేగొను జోత.

కలువపాదాలపై నలరు పారాణితో,
చెలువంపు నొసటిపై వెలుగు కుంకానితో,
నిలువరావమ్మ, మా తెలుగువారి పొలాల;
కొలుతుమమ్మా నిన్ను కోరి కోటిఫలాల.

◆ ◆ ◆

ఇలకు నీ చలువచే తొలకరించిన చూలు
నిలిచి, తొమ్మిదినెలలు నిండి, నీళ్లాడాలి;
కాంక్షించి కవిగన్న కలలన్ని ఫలియించి,
కాంచనమె నెత్తావి గాంచి రూపించాలి; —
కమ్మకస్తురి, పచ్చకపురపు సుగంధమ్మ,
తొగరు బంగరు ఛాయతో మేళవించాలి,
కొంగు బంగరు ఊరి, కొమ్మలై ఏపారి,
పలుగుకొక పసిడిపచ్చల పాతు పలకాలి;
బెల్లు విరుపున జల్ల చిల్ల పెల్లుబకాలి,
కొల్లలై కళ్లాలు కొండలై నిండాలి;
వాయకొక పుట్టెడై ఛాయ పసుపుడకాలి;
వేయి గాదెలపంట యీ ఉగాదియాలి

◆ ◆ ◆

శాస్త్ర సమ్మతమైన సత్సాంప్రదాయాలు,
సర్వదా వ్యవసాయ సరళి రూపించాలి;
సక్రమంబైనట్టి సస్యపరివర్తనము,
శ్రీరామ రక్షయై చీడలను బాపాలి;
పలికి, ధర పండాలి — పండి, ధర పలకాలి
పండించు రైతులకు నిండు ఫలముండాలి.
నీతి తప్పక రైతుజాతి దీపించాలి;
ఈతిబాధలు లేక యిలనధిగమించాలి.

పసిడిపంటల తల్లి పసుపు మాలచ్చి
కుసుమింపు మా తోట కుందనము విచ్చి;
హసియింపు మా వీట పసియింప వచ్చి
పసుపు కుంకాలు మా పడతుల కిచ్చి.

◆ ◆ ◆

పై మెరుగు పాడు పౌడర్ల పాము మరిగి
మరచినారమ్మ నిన్ను మా భరత స్త్రీలు.
పతితపావనమైనట్టి పసుపు పూత,
నేటి బోటికి మోటయి మాటుపడియె.
తెలుగు తోబుట్టు నొసటను తొల్లిటివలె
శ్రీల చిందెడు పసుపు కుంకాల నిలిపి
రక్షగా పాదములకు పారాణి దిద్ది
పరమ సౌభాగ్యమీగదే పసుపులక్ష్మి.



# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



సంఘాభివృద్ధి మరియు పెరిగిపోయెను. కర్మకలాపము లతివిస్తారములై విసుగు జనించుచుండెను. వాటివలన, సామాన్యజనుల బుద్ధి ఆకర్షింపబడి, వారి మనోభిలాషలు శాంతి పొందుచుండెను. వారి భక్తి శ్రద్ధల కనుగుణముగ, వారి జీవిత కష్టనష్టములు నివారణ పొందుచుండెను. కాని, వారిలో ఒక పక్షము వారు, బ్రాహ్మణ భాగములందు గల వైదిక కర్మకలాపములతో తృప్తి పొందలేకుండిరి. వీటి కతీతముగ నుండు సత్యస్వరూపమును, కనుగొనగల సాధనలను వారు వెదకుచుండిరి. వారియొక్క విచార పరిశ్రమ ఫలితముగ, ధ్యానసిద్ధి వలన, భగవతు డెచ్చటనో దూరమున, మేఘముల కావల దాగియుండలేదు. ఇచ్చటనే, మనయందే, అంతరమున యున్నాడని, వారు కనుగొనిరి. ఇట్టి సిద్ధాంతముల ఋజువు చేయగల తర్కముల, తన్నిమిత్తముగల సాధనల, వారు తెలిపియున్నారు. అట్లు మనయందు అంతర్భూతమై యుండు దైవాంశమును కనుగొనజేయు విచారము వేదముల చివరి భాగములందు ఉపనిషత్తులను పేరుతో అమరియున్నవి.

ఈ మంత్ర భాగములు, బ్రాహ్మణభాగములు, ఉపనిషత్తులుగల ఆరణ్యక భాగములు, గురువులుపదేశించుచుండగ, శిష్యులు విని, కంఠస్థము చేసుకొనుచుండిరి. శిష్యులనుండి తరువాతి తరమువారు గ్రహించగలుగుచుండిరి. ఒక్కొక్క తరమువారు, పెద్దలనుండి లభ్యమయిన వంశపరంపరా ప్రాప్త సంపదయగు ఇట్టి జ్ఞానమును సూక్ష్మార్థములందు, వివరణలందు, వర్ణనలందు అభివృద్ధి చేయుచుండిరి. ఈ జ్ఞానము సర్వాధార ఏకైక సత్యమునే వర్ణించుచున్నది. గ్రంథ మొకటేయైనను, వివరముల నేకములై, అసదృశములై అమరియున్నవి.

♦ ♦ ♦

ఇట్లు గురుపరంపరవలన లభ్యమగుచుండు వేద శాస్త్రములను, శిష్యులు జ్ఞప్తియందుంచుకొని తరువాతి తరమువారి కందజేయవలసి యుండెను. ఇట్టి పరిపాటి విరామ మధికముగ నుండునంతకాలము సక్రమముగ జరుగుచుండెను. కాని, జనసంఖ్య అధికముగా కాగ, జీవిత సమస్యలు ప్రబలమాయెను. మానవుడు ప్రపంచమున నలుదిక్కుల పోరాడి, జీవితమును గడపుకొనవలసి వచ్చెను. నివాసము, పొలము, వ్యవసాయము, సమావేశము, రాకపోకలు, వస్త్రరక్షణములు, అన్నియు మానవునికి వేదన కలుగజేయుచుండెను. ఇట్టి ఉపద్రవములవలన, విజ్ఞానసమరసము చెదరిపోయెను. గ్రంథవిషయములు విస్తారమగుటచే, జ్ఞప్తియందుంచుకొని, వర్ణించగల శక్తి క్షీణించెను.

అందుకుతోడు ఇతరమతముల ఉద్రేకములచే, హిందూమతము పూర్తి నిర్మూలమగు స్థితి యేర్పడెను. పవిత్ర శ్రుతులను రక్షించు యోగ్యతకలిగిన వంశముల వారియందు కూడ శ్రుతిజ్ఞానము క్షీణించెను. మనమత చరిత్రయందిట్టి విపరీతపరిస్థితి కల్గు సమయమునకు సాగ, గొప్ప విప్లవకారుడు, కవి, మతసిద్ధాంతవేత్తయగు వేదవ్యాసు లావిర్భవించెను. అతడు మహాఋషి పరాశరుడను బ్రాహ్మణుని కుమారుడు. సత్యవతి యను బెస్తకన్య అతని తల్లి. అతనియందు బెస్తవారి సాహసనైపుణ్యము, బ్రాహ్మణుని గౌరవము, ఆత్మశిక్షణ కూడియుండెను. ఇట్టి శక్తుల రెంటిని, అతడు తన మతోద్ధారక వ్యవహారముగ ప్రదర్శింపగలిగెను.

వ్యాసులు తన కార్యదీక్షయందు, బెస్తవారి సాహసమువలన, సదాచార సంపన్నుల తిరస్కారము నెదుర్కొన గలిగెను. పర్వతములవంటి తరంగముల క్రింద, అగాధసముద్రమున దాగియుండు చేపలను బెస్తవారు కనుగొని పట్టి తెచ్చునట్లు, జీవిత అల్లకల్లోలములలో అగోచరముగ, వేదములందు దాగియుండు విజ్ఞాన రత్నములను వెదకి, విడదీసి, ప్రోగుచేసెను. వేదవాక్యముల నెల్ల సంపుటించెను. ప్రప్రథమమున వేదమునకు రూపు కలిగించెను. నాలుగు సంపుటములుగ విభజించెను. అవియే నేటి హిందూమతమున

గల నాలుగు గొప్ప వేదములు — ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము. ప్రతి వేద సంపుటమున మంత్ర, బ్రాహ్మణ, ఆరణ్యక భాగము లున్నవి. ప్రతి వేదమున చివరి ఆరణ్యక భాగములం దుపనిషత్తులున్నవి. కనుక ఈ ఉపనిషత్తులకు వేదాంత మని పేరుకూడ కలదు.

శాస్త్ర విచార దృష్టిగల విజ్ఞానపాఠకుడు, ఈ మూడు భాగములను విచక్షణతో విచారించగలిగినచో, మంత్రభాగమునందు గల కర్మకాండము యొక్క విపులాంశములందు కలుగు విసుగువలన, బ్రాహ్మణ భాగములు జన్మించెననియు, ఆ బ్రాహ్మణ భాగములచే పొందగలిగిన పరిపక్వదశవలన ప్రశస్తమగు యుపనిషత్తులు సంప్రాప్తమాయెననియు, తెలియగలడు. ఈ మూడు భాగములు మానవాభివృద్ధికై తోడుగనున్నవి. ఒక పుష్పము చెట్టున పుట్టి, వృద్ధిపొంది, ఫలరూపముతో సమాప్తి పొందుటకు వీటిని పోల్చవచ్చును. తొలుత కనబడు మొగ్గయే మంత్రభాగములు. వికసించిన రేకులయొక్క వర్ణములు, వాటి నిర్మాణాలంకారము, అందుగల పరిమళము, అందుండి వెలువడు మందమారుతము, ఆ మారుతమునందలి సుగంధము నాస్వాదించ గుమిగూడు తుమ్మెదలు మొదలగునవి బ్రాహ్మణభాగములు. ఫలాపేక్షతో దేవతల నారాధించి, జీవితాభివృద్ధి కోరు గృహస్థులే తుమ్మెదలు. పరిపక్వదశ పొందుటవలన, పుష్పరేకుల వర్ణములు మాసిపోవును. పుష్పము యొక్క స్థానమున ఫలమొకటి కలిగియుండును. మనోరథసిద్ధి కలిగెనా యనునట్లు పుష్పరేకులు ఎండి రాలిపోవుచు, సంతోషమున గాలియందు నృత్యమాడుచుండును. అచ్చట కలిగిన ఫలము పక్వమగుటను, జన్మ సాఫల్యమొందజేయు ఉపనిషత్తులుగలు ఆరణ్యకము లనబడు తృతీయ భాగమునకు పోల్చవచ్చును.

నామరూప సౌందర్యములతో కూడిన ప్రకృతిని వర్ణించు కవిత్వములు మంత్రభాగములు. శాశ్వత సత్య స్వరూపుని వైదిక బ్రాహ్మణులు కీర్తించు వర్ణనములు బ్రాహ్మణ భాగములు. ఉన్నత - జ్ఞానశిఖరములచేరి, శాశ్వత సత్యానుభవముల వర్ణించు తత్త్వజ్ఞుల ప్రవచనములు ఉపనిషత్తులుగ నేర్పడియున్నవి. అనగా, ఒకే చైతన్య స్వరూపసత్యమును, కవులు, వైదిక బ్రాహ్మణులు, తత్త్వజ్ఞులు, దేహ మనోబుద్ధులనబడు దట్టపు టడవిలో వెదకుచు, వారివారి భాషలో, గద్గద కంఠములతో, ఆనందామృత స్వరములతో, భావావేశములతో తెలిపిన వాక్యములే వేదము లయినవి.

అవి మన పూర్వీకులు అందుకొనగలిగిరి. అట్లు జ్ఞప్తి యందుంచుకొనబడి, భద్రపరచి, తరతరములవారికి అందుచుండు సూత్రములు, మన పవిత్ర హిందూమత కళావిశేషములుగ నున్నవి. అవి మన పిత్రార్జిత సంపద యనదగియున్నది.

వేదములందలి క్రమవిచారమంతయు, శాశ్వత, అనంత, పరబ్రహ్మముయొక్క వర్ణనములు. దేహ, మనో, బుద్ధులతో తెలిపి, పరికించి, అనుభవింప సాధ్యముకాని, అత్యున్నత అనుభవముల నందు వర్ణింపబడియున్నవి. జాగ్రత, స్వప్న, సుషుప్తుల నావలి, తురీయావస్థను చేరగలిగిన మానవుడు, పరిమితుల, బంధముల, మృత్యుభయముల నతిక్రమించి, అనంత బ్రహ్మస్వరూపము తానని తెలియగలడు. కనుక, అట్టిస్థితిని కనుగొనుటకు బజారు భాష, ప్రణయ వాక్యములు, మాలవాడ సామెతలు, త్రాగుబోతుల దుర్భాషలు ఉపయోగపడవు. ప్రశాంత మానస దివ్యానుభవములను భాష సమీపింపజాలదు - వర్ణించుట, నిర్ణయించుట, సూక్ష్మముగ సూచించుట, భాషకు అసాధ్యము. సత్యస్వరూపుని ఇట్టిట్టివాడని నిర్ణయించుట యనగా, అతనికి పరిమితులు కల్పించుట యగును.

భాషయందు కొన్ని పదములు క్రమరీతి నెలకొని యొక వాక్యమగుచున్నది. ప్రతి పదమొక హృదయ భావమునకు సంజ్ఞ. వినువారి కొకరీతిగ తదనుగుణముగ, ఆలోచనల కలిగించును. ఇట్టి సంజ్ఞలు, సంఘమునగల అనేక అనుభవములను తెలుపుచున్నవి. కనుక సంఘమునగల సామాన్య వ్యవహారముల జరుపుకొనుటకు భాష ఒక ఉపకరణముగ నున్నది. "తేనెవలె మధురముగా నున్నది" అని నేను పలికినచో, శ్రోతలకు నాయొక్క నిర్దిష్టభావము గోచరమగుచున్నది. ఎందుకనగా, తేనె యొక మాధుర్యము సర్వానుభవ సిద్ధముగ నున్నది. కాని, "వాడ్కావలె ఘాటుగ నున్నది" అనినచో భారతదేశ మిత్రులకు గ్రాహ్యము కాకపోవచ్చును. కాని, యీ భావము రషియన్ సోదరులకు సుగ్రాహ్యమగుచున్నది. వాడ్కా అను మధుపానము భారతీయులకు పరిచయము లేకున్నను, రషియా సోదరులకు అతి పరిచయముగ నున్నది.

ఇట్టి ఉదాహరణముల వలన, భావాతీతానుభవముల వర్ణించు శ్రుతుల భాషయొక్క పరిచయము, మనకెంత అవసరమో తెలిసికొనవచ్చును. శ్రుతు

లందుపయోగించబడిన పదములు, వాటి సామాన్య సంజ్ఞార్థముల మాత్రము తెలుపునవి కావు. వాటి వాచ్యార్థమున కతీతముగనుండు లక్ష్యార్థముల నవి పరిచయము చేయుచున్నవి.

ఉపనిషత్ విచారములందు, లక్ష్యార్థములు ముఖ్యము. గనుక, సంస్కృత భాషయందు వ్యాకరణ జ్ఞానము గలదను అభిమానముతో, నిస్పృహాయముగ ఉపనిషద్విచారమును ప్రవేశించు విద్యార్థులకు, మతి భ్రమ కలుగునేగాని, ఫలము దొరకదు. వారు తమ అయోగ్యతను అంగీకరించరు. చిలుక పలుకులవలె, ఇందలి విద్యను కంఠస్థము చేసుకొని, ప్రగల్భములు పలుకుచు, భూమికి భారము, సంఘమునకు మోత, చర్చయందు కోతగ నుందురు.

నిత్యజీవితమున, భాషకుగల శక్తి అతివిస్తారమనియు, భాషతో తెలుపజాలని అనుభవములేవియు లేవని, భాషకొక విపరీత అభిమానము మనము చూపుచున్నాము. అనగా, భాషయందు మనకుగల నమ్మకమతిగొప్పదని తెలియుచున్నది. శాస్త్రరీతి విచారించినచో, నిత్య వ్యవహారముల తెలుపుటకు భాష చాలియున్నదని నమ్మగలిగినను, భాషకుకూడ పరిమితి గలదని తెలియవలెను. భాష తెలుపగల విషయములు నాలుగు విధములని ఋషులు తెలిపియున్నారు. వస్తువును వర్ణించుట, వస్తుగుణముల వర్ణించుట, క్రియలను వర్ణించుట, విషయములందు గల పరస్పర సంబంధముల తెలుపుట — ఈ నాలుగు విధముల నతిక్రమించి, భాష ఉపయోగపడుటలేదు. ఈ పరిమితులకు లోనగు విషయ ప్రపంచమున ఈ నాలుగు విషయములు కనబడుచున్నవి. కనుక, ప్రపంచవ్యవహారములకు భాష తగియున్నది. కాని, ఈ నాలుగు విధములకు చేరని, సత్య అంశమొకటి, వస్తు, గుణ, క్రియ, సంబంధములకు చేరకుండినచో, అట్టి సత్యమును, ఏ భాషగాని తెలుపజాలదు.

సర్వోత్కృష్టమైన సత్యమును గురించి, ఋషులు విచారణచేసియున్నారు. అట్టి సత్యము నశించువస్తువు కాదు. దానికి గుణములు లేవు. అది క్రియారహితము. సంబంధహీనము. అట్టి అద్వితీయ సర్వాంతర్యామి యగు సత్యమునుగూర్చి విచారించుటకు, వాచ్యార్థమున కన్న, విశేషమగు లక్ష్యార్థములు గల భాషనొక దానిని, ఋషులు నియమించుకొనవలసి వచ్చెను. అట్లు పరిష్కృతము పొందిన, సంస్కరింపబడిన భాష, భావాతీతమును తెలుపగల భాష, సంస్కృత భాషగ నేర్పడెను.

వేదములందు, సత్యస్వరూపుని వర్ణన లేదు. నిర్వచనము లేదు. అతనిని తెలుసుకొనగల సూచనలు మాత్రము కలవు. మిక్కిలి శాస్త్రయుక్తమగు తర్కవాదముల గ్రహించగల సూక్ష్మబుద్ధియు, గురువాక్యములందు పూర్ణప్రేమతో కూడిన హృదయానురాగము ఎవరికి కలదో, వారు ఈ విచారమును గ్రహించగలరు. గురుశిష్యుల హృదయము లేకీభావము పొందవలెను. భక్తి, శ్రద్ధ, విశ్వాసము, అక్రూర, నమ్మకము, సానుభూతి కలవారు మాత్రము వేదాంతమునందుగల రుచిని తెలుసుకొనగలరు. తత్ఫలితముగ, ప్రాపంచక దృశ్యములందుగల కోటుపాటులను, దుఃఖసారములను తొలగించుకొని, నిత్య, దివ్య, సుఖము ననుభవింపగల యోగ్యత పొందుచున్నారు.

ఇట్టి కారణములవలన సాధకుడు, పరిపూర్ణపదవి ననుభవించుచుండు కరుణాస్వరూపుడగు గురువును ఆశ్రయించవలెను. అతని పాదసేవ చేయవలెను. అతని వాక్కులనేగాక, అతని ప్రతి వ్యవహారమునందును సుగుణముల గ్రహించగలుగుచుండవలెను.

## పరిచయము 2.

మన పాఠ్యగ్రంథము ఐతరేయోపనిషత్తు. ఇయ్యది ఋగ్వేద బ్రాహ్మణ భాగమున కలదు. ఉపనిషత్తులకు గ్రంథకర్తల సంతకములుండవు. ఒక ఉపనిషత్తును తొలుత శిష్యప్రపంచమునకు ప్రసాదించిన మహాత్ముని, కొన్ని సూక్ష్మాంశములవలన, ఒకొక్కప్పుడు, నిర్ణయింప సాధ్యమగుచున్నది. బృహదారణ్యమునకు యాజ్ఞవల్క్యుడు, కఠోపనిషత్తునకు యమధర్మరాజు, ప్రశ్నోపనిషత్తునకు భగవాన్ పిప్పలాదుడు, కారకులని తెలియుట విశేషాంశములుగనున్నవి. వాటియందు గురుస్థానమువహించిన ఋషిని, గుర్తెరుగ సాధ్యమగుచున్నది.

అహంకార నిరసనమే ఆత్మానుభవమునగల రహస్యము. తాను ఎన్నుకొనిన కార్యమున, తన మనోబుద్ధుల లయింపగల మహనీయుడు ప్రతిభాశాలి యనబడును. ఒక చతురయుపన్యాసకుడుగాని, ఒక కవిగాని, తాను చేత బూనిన కార్యమున మైమరచి లగ్నమైనచో, అత్యుత్కృష్ట నైపుణ్యమును ప్రదర్శింప గలుగుచున్నాడు.

ఆదేవిధముగ, మహాత్ములు, అహంకార జీవభావము నతిక్రమించి, పరమాత్మయందు పూర్ణముగ లయముపొందుచున్నారు. తమ అనుభవములను భావోద్రేక శిఖరములనుండి పరిపూర్ణపదవినుండి ఉపదేశ

వాక్యముల రూపమున పలుకుచున్నారు. అట్టి పలుకుల యందలి ఆనందామృతమును, శిష్యవర్గమునకు చేరిన మనము, రుచిచూడగలుగుచున్నాము. అట్టి మహాత్ములు, మరల దేహమనోబుద్ధులతో వ్యవహరించుటకు జారివచ్చినపుడు తాము ముందు పలికిన పలుకులు తమవని వాటియందనురాగము చూపరు. ఆ సత్యవాక్యములు "నావని" చెప్పుకొనరు. ఎందుకనగ, అట్టి అనురాగము పొందుటకు, తమ మనోబుద్ధుల అంతస్థునందు, ఆ మాటలకు గల విలువను వెదుకవలసి వచ్చును. అట్టి ప్రయాసను వారు అంగీకరించరు.

అయినను, అదృష్టవశమున, ఈ శ్రుతిపాఠమునకు అంతరమున యొక సొగసైన కథ తెలియుచున్నది. ఆ కథవలన, ఈ ఉపనిషత్తుయొక్క ఆవిష్కర్తను నిర్ణయింప సాధ్యమగుచున్నది. అట్టి గ్రంథకర్త, యొక గొప్పవంశమునకు చేరినవాడు కాడు. కనుక, ఈ ఉపనిషత్తునకొక వైశేషత కలిగినది.

ఐతరేయోపనిషత్తును ప్రసాదించిన ఋషి, మహీదాసుడని ఐతిహ్యము కలదు. అతడొక బ్రాహ్మణునికి, ఇతర (జాతి) స్త్రీయందు జన్మించియుండెను. అనగా, ఆమె ధర్మపత్ని కాదు. మహీదాసుడనగా, భూమికి సేవకుడు. ఒక కష్టజీవి, కూలివాడు, దేహకష్టముజేసి జీవించువాడు.

బాలుడైదేండ్ల వాడాయెను. ఒకనాడు తండ్రి హోమగుండమువద్ద కూర్చుని, అగ్నికార్యము చేయుచుండగా, బాలుడు సమీపించి, తండ్రి యొడిలో కూర్చుండబోయెను. ఆ బాలుడు ఇతరభార్య పుత్రుడు గనుక, ఆ సమయమున తండ్రి నంటగల స్వతంత్రము లేకుండెను. తండ్రి అతనిని దూరముగ నుంచెను. బాలుడు నిరాశతో, దుఃఖించుచు, తల్లి యొడి చేరెను. తన దుఃఖమునకు కారణము తెలుసుకొనెను. ఏడువసాగెను. తల్లి హృదయమున మంట లేగెను. కాని, ఏమిచేయగలదు? ఆమె కుమ్మరి జాతికి చేరినది. దిక్కెవ్వరు లేరు. ఎవరితో మొరపెట్టుకొనగలదు? తన యావనమునందలి అవివేకమువలన, కామోద్రేకము వలన, ఆ బ్రాహ్మణుని వశమగుటచే, తన బాలునికిట్టి అవమానము కలిగినదని, కిలబడి దుఃఖించసాగెను. భూదేవి కౌగిట చేరెను. తల్లి యొడిలోపల దుఃఖించసాగెను.

కుమ్మరివారికి భూదేవి తల్లి. తన బిడ్డకు కలిగిన దుఃఖమును భూదేవి గమనించెను. ఆలకించెను. ఓదార్చనెంచెను. ఆశీర్వదించ నిశ్చయించెను. ప్రత్యక్షమాయెను. ఓదార్చెను. వరము కోరమనెను. అమాయకురాలు, కోరిక లెక్కడిది! తన పుత్రుడనుభరించు మనోవ్యధకు తగు నివారణ యొసగమని కోరెను. భూదేవి ఆ పిల్లవాని దుఃఖమునకు కారణమగు సంఘ తిరస్కారమును పోగొట్టుటే కాదు. జన్మ తిరస్కారము చేయగల బ్రహ్మవిద్యను బోధించెను. బోధించినది భూదేవి. ఆలకించినది కుమ్మరి పిల్లవాడు. అట్టి బోధయందలి నైపుణ్యము నేమని కొనియాడగలము! ఆ బాలుడు కుమ్మరి బాలుడు కాదు. బ్రాహ్మణపుత్రుడు కాదు. బ్రహ్మస్వరూపుడాయెను. సద్యోముక్తి కుదిరెను. తన జ్ఞానార్జితమును, ఐతరేయోపనిషత్తు రూపమున, ప్రపంచమునకు నివేదించెను. తన భాషలో, సామాన్యమానవుల భాషలో, అసహాయుల భాషలో, కార్మికుల భాషలో, కూలిసల భాషలో, బ్రహ్మనందపదవి నొసగు క్రమమును మానవుడు మాధవుడు కాగల మార్గమును - తెలిపెను. మన కళానైపుణ్యమునకు అట్టి విద్యయే ఆధారమై యున్నది.

(సశేషము)

—(o)—

# పగటి కలలు

మరువాడ సూర్యప్రకాశం

పున్నమ వెన్నెల రేయి
కన్నుల కెన్నడు హాయి
నన్ను వలచి ఒక నాతివచ్చెను
వెన్నెల రేయిలో_వెంటతిరిమెను ॥పు॥
చిన్నది వచ్చి-చెంతనిలచెను
సన్ననిస్వరముతో-సరిగమపాడెను॥పు॥

చిన్నది లేచి-చిటికలో పోయెను
ఎన్నడువచ్చునో - ఎరుగనైతిగా ॥పు॥
విన్నారయ్యా! వింతకలేయిది
చిన్నది లేదు - సుందరి లేదు ॥పు॥
అన్నా వింటివ - అమృతతుల్యమా
పెన్నిధిగన్నా - పగటి కలేయిది ॥పు॥



# శార్వరి రాక

శ్రీ ఆలా సరోజినీదేవి

శార్వరి తరు శాఖపై
శారిక కల కూజితమ్ము
మధురమ్ముగా వినిపించె నోహో!
మనోహరమ్ముగ కనిపించె నోహో!!

మావి తోపులలో దాగి
మత్తిల్లిన కోయిలాగి
తన గొంతును సవరించె నోహో!
తన వంతు గీతిని పాడెనోహో!!

పూల రేకులలో మూగి
పూల తేనెలన్ని త్రాగి
శార్వరి నామసంవత్సరాది హో!
శార్వరి భ్రమరాలు పాడెనోహో!!

బాలకుల పసి హృదయాలు
బాధిత జన సందోహాలు
నూతన సంవత్సరాది కోహో!
యెత్తిరి వారు నీరాజనా లోహో!!

ఆంధ్ర భూపాల కులంత
ఆబాల గోపాల మంత
వికారికి వీడుకోలు నిచ్చెనోహో!!
శార్వరికి వేడుకోలు నిచ్చెనోహో!!



# సరళ

### శ్రీమతి జి. సరస్వతి

గడియారం ఆరు గంటలు కొట్టింది. అస్తమించే సూర్యుని అరుణకిరణాలు పరిసరాలపై వింత కాంతుల్ని వెదజల్లుతున్నాయి. సరళ అప్పుడే లేచి వెళ్లి గార్డన్‌లో కూర్చుంది. ఇంతలో జ్యోత్స్న వచ్చి, 'నేను పిక్చర్‌కి వెళ్తున్నా, కారుని థియేటర్‌కి తీసుకురమ్మని డ్రైవర్‌తో చెప్పు' అని వెళ్లిపోయింది.

'నాకు ఒంట్లో యేమీ బాగులేదు జ్యోత్స్నా! నా దగ్గర కూర్చోవూ?' దీనస్వరంతో అడిగింది. జ్యోత్స్న ముఖం చిట్లించుకొని, 'ఆ పిక్చర్ యీ రోజుతో ఆఖరు. నేను వెళ్లితీరాలి' అని గబగబా వెళ్లిపోయింది. ఆమె వెళ్లినవైపే చూస్తూ భారంగా నిట్టూర్చింది సరళ. తన చేతుల్లో పెరిగి పెద్దదైన జ్యోత్స్న యీనాడు తనకు దూరమైపోతూంది. 'అమ్మా' అని చుట్టుకొని తిరిగిన జ్యోత్స్నలో యెంత నిర్లక్ష్యం పేరుకొంది. 'అమ్మా' అనే పిలుపే తనకు కరువైంది! తనమనస్సు నామె అర్థం చేసుకోలేదు! పాలిపోయిన ఆమె చెంపలమీదుగా కన్నీళ్లు జారాయి.

♦ ♦ ♦

ఆనాడు ఇరువదేళ్ల అందమైన సరళ కాలేజీలో బి.ఏ. చదువుతూంది. పెళ్లి చేసుకోగూడదని, పెద్ద చదువులు చదివి స్వతంత్రజీవనం గడపాలని కలలు కనేది.

ప్రకాశరావు సరళ మేనత్త కొడుకు. తల్లిదండ్రుల్ని చిన్నతనంలో కోల్పోయాడు. సరళ తండ్రి పెంచి మెడ్రాసులో యం.బి.బి.యస్. చదవడానికి పంపాడు. అక్కడ ప్రకాశరావు తన క్లాసుమేటయిన శశిని వివాహం చేసుకున్నాడు. ఇది సరళ తల్లిదండ్రులకు నిరాశను, వ్యథను కలిగించింది. రెండు కుటుంబాల మధ్య బాంధవ్యం సడలిపోయింది.

ప్రకాశరావు సంసారం కొన్నాళ్లు హాయిగా కొనసాగింది. జ్యోత్స్న పుట్టిన కొద్దిరోజులకు శశికి జబ్బుచేసి చనిపోయింది. శశి మరణం ప్రకాశరావును తీవ్రంగా క్రుంగదీసింది. ఇక ఆ ఊళ్లో ఉండలేక విశాఖపట్నం వచ్చాడు.

ఆరేళ్ల తరువాత యింట్లో అడుగుపెట్టిన ప్రకాశరావును సరళ మాత్రమే ఆప్యాయంగా పలుకరించింది. శశి చనిపోయినందుకు సానుభూతి చూపిస్తూ పాపను చేతుల్లోకి తీసుకుంది.

తనరాక మేనమామకు యిష్టంలేదని గ్రహించిన ప్రకాశరావు వేరే వెళ్లిపోయాడు. సరళ అప్పుడప్పుడు వెళ్లి చూచివచ్చేది. పాప సరళకు విడని బంధమైంది.

ఇదంతా గమనించిన సరళ తల్లి ఒకరోజు గద్దించింది.

'పెళ్లి కావలసిన నీవు ఆ అప్రాచ్యుడి యింటికి వెళ్లడం శ్రేయస్కరం కాదు. వాడితో మనకున్న సంబంధం యేనాడో తెగిపోయింది. లోకనిందలకు గురై భవిష్యత్తు పాడుచేసుకోవడం వాంఛనీయం కాదు' అన్నది తీవ్రంగా.

'కళ్లు మూసుకొని అపనిందలు వేసే లోకానికి నేను భయపడను', సరళ కోపంతో అరిచింది.

'అనుభవం, లోకజ్ఞానం లేని పిచ్చిదానవు నీవు. అబద్ధమైనా పదిమంది యేకకంఠంతో నిజం అని పరిగణింపబడుతుంది. నా మాట విను అమ్మా!' సరళ తల్లి శాంతం తెచ్చుకొని కూతురికి నచ్చజెప్పింది.

♦ ♦ ♦

వారంరోజుల తరువాత ఒకరోజు కాలేజీకి వెళ్తూన్న సరళ కారుహారన్ విని ప్రక్కకు తిరిగి చూచింది. ప్రకాశరావు కారుదిగి ఆమెవద్దకు వచ్చాడు.

'నీవుకూడ నన్ను దూరం చేసుకోవాలని ఉందా సరళా?' అతని దీనవదనం, ప్రశ్న సరళను కరిగించేశాయి.

'నేనేంచేయను ప్రకాశం? నాకు కావాలని ఉన్నా యితరులకు భయపడవలసి వస్తూంది. పాప నాకు జ్ఞాపకంలేని క్షణం లేదు' అన్నది భారంగా.

'నిజమే. నీవొక వెలుగువి సరళా! నాకెలా లభ్యమౌతావు? ఈ అభాగ్యుడికోసం నీ జీవితం

ఉచ్చులో పడటం వాంఛనీయం కాదు' అని వెనుదిరిగాడు.

ప్రకాశరావు మాటలు సరళలో క్రొత్త ఊహను రేకెత్తించాయి. అతనికి తనను పెళ్లి చేసుకోవలనే ఉద్దేశం ఉందా? పెళ్లి చేసుకోకూడదనుకున్న సరళ నిశ్చయం ఆ సంఘటనతో సడలింది.

కొద్దిరోజులవరకు యేవిధమైన నిర్ణయానికి రాలేని సరళ మథనపడింది. అవివాహితగా జీవితాన్ని కొనసాగించడం కష్టమని గ్రహించుకున్న సరళ తనకు బాగా పరిచితుడైన ప్రకాశరావును పెళ్లి చేసుకోవడం మంచిదని భావించింది.

తండ్రి తనకు పెండ్లి సంబంధాలు చూస్తున్నాడని తెలిసి సరళ తన అభిప్రాయం తల్లితో చెప్పింది. తండ్రికి తెలిసి, అతను మండిపడ్డాడు. ఆ పెళ్లి జరిగితే తన ముఖం చూచే అర్హత కోల్పోతుం దన్నాడు. ప్రకాశరావే తనకు నచ్చిన వరుడని తన ఉద్దేశం మారదని ఆమె స్పష్టంగా చెప్పేసింది.

◆ ◆ ◆

'ఈ నిర్భాగ్యుడికోసం తల్లిదండ్రుల్ని దూరం చేసుకుంటావా సరళా' అన్నాడు ప్రకాశరావు.

'నేనున్నంత కాలం నీవలా అనుకోవద్దు ప్రకాశం!' అన్నదామె నిశ్చితస్వరంతో.

రిజిస్ట్రార్ ఆఫీసునుంచి వచ్చి యింట్లో అడుగు పెట్టాక, 'నేను చాల అదృష్టవంతుడిని సరళా!' అంటూ ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

'ప్రకాశం!' సరళ అతని హృదయంలో తల దాచుకుంది.

◆ ◆ ◆

సరళ జ్యోత్స్నను ఎంతో ప్రేమగా చూచేది. 'అమ్మా' అంటూ పాప ఆమె నొక్క క్షణం వదిలేది కాదు. ప్రకాశరావు మనస్సు తేలికపడింది.

సరళకు కొడుకు పుట్టాడు, అయినా ఆమె జ్యోత్స్నను యెప్పటిలాగే ఆదరించేది. ఆమె నిష్కల్మష హృదయానికి భర్త చాల ఆనందించేవాడు.

◆ ◆ ◆

కాలగర్భంలో పద్దెనిమిది సంవత్సరాలు లీనమై పోయాయి. జ్యోత్స్న యిప్పుడు ఇంటరు చదువుతూంది. గారాబంగా పెరగడంవలన ఆమెలో అహంభావం, పట్టుదల స్థావరమేర్పరచుకున్నాయి.

సరళ తన 'సవతి తల్లి' అని ఒక నర్సువలన తెలిసినప్పటినుండి జ్యోత్స్నకు సరళపట్ల నిర్లక్ష్యభావమేర్పడింది. చాలా ముభావంగా ఉండసాగింది. జ్యోత్స్నలోని మార్పు సరళను చాల కలవరపరచింది.

'అమ్మంటే యిష్టంపోయిందా జ్యోత్స్నా? తప్పించుకొని తిరుగుతున్నావు', సరళ బాధాపూరితమైన స్వరంతో అడిగింది.

'లోకానికంతటికీ తెలిసిన విషయాన్ని నాదగ్గర దాచి లాభంలేదు. నాకు అమ్మలేదు', జ్యోత్స్న యేదో పోగొట్టుకొన్న విధంగా యేడవసాగింది. సరళ స్తంభించిపోయింది. తను అమ్మ కాదా? జ్యోత్స్న తన కూతురని చెప్పుకొనే హక్కు లేదా? ఇన్నాళ్ల తనప్రేమని జ్యోత్స్న కాదంటూంటే ఆమెకు దుఃఖం పొంగివచ్చింది. తన లక్ష్యం భగ్నమై పోయినట్లు బాధపడసాగింది.

ప్రకాశరావుకు జ్యోత్స్న సరళయెడల చూపే విముఖత ఆశ్చర్యాన్ని కలిగించింది.

◆ ◆ ◆

'నేనే నీ అమ్మను జ్యోత్స్నా! అమ్మ లేదంటే నేను సహించలేను', మగతగా పలవరిస్తున్న సరళ నుదుటిపై చల్లని స్పర్శతో ఉలిక్కిపడింది.

'ఎందుకు బాధపడుతున్నావు? నాతో చెప్పవూ సరళా?' ప్రేమతో ఆమెచేతులు స్పృశిస్తూ అడిగాడు.

'నేను — నేను జ్యోత్స్నకి అమ్మనే కదూ!' వెక్కి వెక్కి యేడుస్తూ అతని హృదయంమీద వాలిపోయింది. సరళ ఆవేదన అతనికి అర్థమైంది. జ్యోత్స్న అపోహతో సరళకు దూరంగా తిరుగుతూందని, అది సరళకు దుస్సహంగా ఉందని గ్రహించాడు. జ్యోత్స్నమీద చాల కోపం వచ్చింది. ఏమీ మాట్లాడలేక సరళను తీసుకొని లోపలికి వెళ్లిపోయాడు.

◆ ◆ ◆

'అమ్మకు సీరియస్‌గా ఉంది, ఈరోజు కాలేజీ

సెలవుపెట్టి హాస్పిటల్‌కి రా జ్యోత్స్నా!' ప్రకాశరావు కూతురుతో చెప్పాడు. జ్యోత్స్న నిర్లక్ష్యంగా ఊరుకుంది.

'అర్థంలేని అపోహాలతో అమ్మను దూరం చేసుకుంటున్నావు' ప్రకాశరావు తీవ్రంగా అన్నాడు.

'ఇన్నాళ్లూ నన్ను మోసం చేస్తూనే వచ్చారు నాన్నా! సరళ నాతల్లి కాదని నాకు తెలుసు' జ్యోత్స్న అన్నది.

'మోసమా? తల్లిదండ్రుల్ని ధిక్కరించి, నిన్ను హృదయంలో దాచుకొని పెంచిన సరళ నీ తల్లి కాదూ' అతని కంఠం రుద్ధమైంది. జ్యోత్స్న సంబంధం లేనట్లుగా వెళ్లిపోవడానికి అడుగులు వేసింది.

'జ్యోత్స్నా!' ప్రకాశరావు అరిచాడు. ఆమె చటుక్కున వెనుదిరిగి చూచింది.

'సరళ నీతల్లి కానిమాట నిజమే జ్యోత్స్నా! కన్నతల్లికి పిల్లలపై ప్రేమ సహజంగా ఉంటుంది. అందులో అతిశయోక్తి యేమీలేదు. కాని సవతి తల్లి అయినప్పటికీ హృదయంలో దాచుకొని పెంచిన సరళ ప్రేమ గొప్పది కాదూ! అటువంటి అమృత హృదయం మాతృమూర్తి కాదూ! అటువంటి అమ్మను కాదన్నావు. ఆమె హృదయం యెంత క్షోభిస్తూందో నీవు గుర్తించలేకపోతున్నావు. ఇప్పటికైనా సరళ ప్రేమని అర్థంచేసుకొని ఆమెకు మన శ్శాంతి చేకూర్చు!' ప్రకాశరావు భారంగా అన్నాడు.

తండ్రి మాటలు జ్యోత్స్నలో పశ్చాత్తాపాన్ని రేపాయి. సరళ అతిప్రేమతో తనను ఆదరించిన ప్రతిదృశ్యం కళ్లముందు కదిలింది. ఆమెలో ఆవేదన పొంగిపొరలింది.

♦ ♦ ♦

'అమ్మా! నన్ను క్షమిస్తావా?' అంటూ జ్యోత్స్న సరళ చేతులు పట్టుకొని కన్నీళ్లు కార్చింది.

'అమ్మా!' అనే పిలుపు నరనరాల్లో ప్రవహించి సరళ పులకించింది.

'జ్యోత్స్నా!' వాత్సల్యంతో కూతురిని దగ్గిరకు తీసుకొని శుష్కహస్తాలతో ప్రేమగా నిమిరింది త్యాగమూర్తి అయిన సరళ.

ప్రకాశరావు సంతోషంగా నిట్టూర్చాడు.

# ఆర్యాణి

శ్రీ నాయుడు వెంకట సీతారామమూర్తి



భారతావనిలో తురుష్కుల పాలన నాటి కాలమది. మతోన్మాదులైన మహమ్మదీయులు హైందవజాతిని ఛిన్న భిన్నం చేసి, హిందూమతాన్ని సర్వనాశనంచేసిన రోజులవి. పవిత్రమైన ఆలయాల్ని పడగొట్టి వాటిపై మశీదుల్ని నిర్మించేఘడియలవి.

ఆ నాడు హిందువులందరూ మహమ్మదీయుల చేతిలో కీలుబొమ్మలు. జాతిలోని అంతఃకలహాలు, కుట్రలు, పలితంగా, వారి సామ్రాజ్యాల్ని కైవసం చేసుకొని హిందూ మత ప్రభోధకుల్ని ఉరితీయించేరు. మత గ్రంథాలన్నిటినీ మట్టి పాలు చేశారు. భారతీయ సంస్కృతీ సాంప్రదాయాల్ని సర్వ నాశనంచేశారు.

ఆనాటి మహమ్మదీయ మహాసామ్రాజ్యాన్ని సుల్తాను ప్రభువు పాలిస్తున్నాడు. సుల్తాను అత్యంత కాఠిన్య హృదయుడు. కామాంధుడు. స్త్రీవ్యామోహం ఎక్కువ. జీవితంలో యావ్వనం తప్ప మరేదీ ఉండరాదనే మనస్తత్వం ఈతనిది. రాజ్యభారాన్ని మంత్రిచేతిలో పెట్టేడు. ఈతనికి కావలశింది ఒక్క స్త్రీ.

దర్బారులో పరిచర్యలు చేసేవారందరూ స్త్రీలే. మత్తెక్కమైన విందులు, వినోదాలు, నగ్న స్వరూపంలో కామోద్రేకప్రేరితమైన నాట్యాలూ ఈతనికి మక్కువ.

దేశంలో ఉన్న అందమైన యువతుల కోసంగూడ చారులను పంపించేవాడు. ఎట్టి పరిస్థితుల్లోనైనా, ఎక్కడ ఉన్నా దౌర్జన్యంగా అపహరించవలసిందే!

ఈతని హృదయంలో దయ, దాక్షిణ్యం, ప్రేమ, అనురాగం, అనేవిలేవు. స్త్రీలే ఈతనికి విలాసవస్తువులు. యావ్వనవతి, రూపవతి, అయిన అచ్చర కౌగిట్లో ఎల్లప్పుడూ ఉండవలశిందే. నిండు యవ్వనంతో నవనవలాడుతున్న .... యువతి ఎల్లప్పుడూ ఈతని సేద దీర్చడానికి వింజామరలు వీచవలశిందే.

విదేశాలనుంచి బానిసలుగా తీసుకు రాబడి డబ్బుకోసం విక్రయించబడిన అందమైన అప్సరసలు అంతఃపురంలో అనేకులున్నారు. వీరు తమ తమ చాకచక్యంతో సుల్తానును మెప్పించి, కాముకచర్యలతో ఉద్రిక్త పరచడమే వీరి నిత్యకర్తవ్యం. ఎక్కువగా ఆకర్షింపబడే "ఆశిక్ని"లకు బహుమతులు కూడా యివ్వబడేవి.

వీరుగాక మతానుసారంగా పరిణయమాడిన మగువలుకూడా ఉన్నారు. వీరిని కూడా వేళ్లమీద లెక్కపెట్ట శక్యంకాదు. వివాహమాడిన మొదటిరాత్రే ఆమెను అనుభవిస్తాడు. తరువాత ఆమెకు ప్రత్యేకమైన భవంతిలోనివాసం. చుట్టూసైనికులు కాపలా. ఏకాంతంగా, ఒంటరిగా, ఖైదీగా, ఆయువతి జీవితాంతం గడపవలశిందే ఈ నియమాన్ని అతిక్రమించిన వారికి ఒకటే శిక్ష. — ఉరిశిక్ష.

కల్యాణి కళింగ రాజ పుత్రి
నిండు జవ్వని.
అపురూపసుందరి.
సౌశీల్య

తగిన వరునికోసం స్వయంవరంచాటిం చేడు కళింగరాజు. వివిధ దేశాలనుంచి, మేధావులందరూ విచ్చేశారు స్వయంవరా నికి. రాకుమారి పూలదండ చేత బూని మేలి ముసుగు నుంచి క్రీగంటి చూపుతో రాకుమారుల ముఖారవిందాల్ని తిలకిస్తు న్నది. పొంగి పొరలివచ్చే ముశి ముశి నవ్వుల్ని ఆపుకుంటూ, నెమ్మదిగా నడక సాగిస్తూ రాజపుత్రులను పరీక్షిస్తున్నది.

ఇంతలో కోట వెలుపల కోలాహలం- సుల్తాన్ సైనికులు కళింగరాజ్యంపై విరుచుకుపడ్డారు. కళింగ రాజును కడతేర్చి కోటను వశపర్చుకున్నారు. రాకుమారి సుల్తాన్ చేతికిచిక్కింది. స్పృహతప్పి ఉన్న రాకుమారి మెడలో మంగళసూత్రాన్ని కట్టి తన దేశానికి తీసుకుపోయాడు సుల్తాను ప్రభువు.

కల్యాణికి తెలివి వచ్చింది. కళ్లు తెర చింది. మెడలోని మంగళసూత్రాన్ని చూశి ఆశ్చర్యపోయింది.

''భయపడకురాణీ ? '' బొంగురుకంఠం కల్యాణికి దగ్గరగా చేరింది.

''ఎవరు నువ్వు ? '' కల్యాణి ప్రశ్నిం చింది.

''నీ భర్తను''

రాకుమారి నివ్వెర పోయింది.

''అవును రాణీ ? మీామతానికి వ్యతిరే కుణ్ణయినా నీ కోసం మీా మతానుసారం గానే నిన్ను పరిణయమాడేను. హిందూ మతంలో రాక్షసవివాహాలు అనాదినుంచీ వస్తున్న ఆచారమే. నేనూ నిన్ను ఆపద్ధతినే చేరదీసుకు వచ్చేను''

''బంధించి తీసుకువచ్చేరా ? ''

''సౌందర్యరాశివి గనక నా హృద యానికి రాణిగా చేసుకున్నాను. నిన్ను ఎంతో గౌరవిస్తున్నాను. ప్రేమిస్తున్నాను నన్ను కనికరించు, తృణీకరించకు ''ఎక్కడ ఏరకం నాటకం ఆడాలో సుల్తాను ప్రభువుకి పూర్తిగా తెలుసు.

''ప్రేమకు కలిమిలేములు, మతభేదాలు, అంతరాయంకాజాలవు. యిందుకు మీా తండ్రి వ్యతిరేకించినందువల్లనే దండ యాత్ర చేయాల్సివచ్చింది. నిన్ను మన సారాప్రేమించేను. నన్ను ప్రేమించు'' ఈ రకం పాఠం చాలామందికి అప్ప జెప్పేడు సుల్తాను ప్రభువు.

కల్యాణి మారు మాటాడలేకపోయింది. తనకు వివాహం జరిగిన మాట వాస్తవం. అది ఏ విధంగా జరిగినా, ఎలా జరిగినా, పవిత్రమైన మంగళసూత్రం తనమెడలో బంధింపబడింది. కల్యాణి హృదయం కరి గింది. సుల్తాను ప్రభువు తనహృదయానికే ప్రభువు.

భర్తకు నమస్కరించింది కల్యాణి. ఆనాటి రాత్రి ఆనందంగా గడచిపోయింది. మరునాటినుండి కథ మామూలే.

సుల్తాను ప్రభువు కల్యాణి కంటికే దూర మయ్యేడు. కల్యాణిని ఓ ప్రత్యేకమైన భవనంలో పంజరంలోచిలుకవలె నివాసం ఏర్పాటు చేశారు. రోజులు - వారాలు - నెలలు గడుస్తున్నాయి.

కల్యాణి ఎంతగానో భర్తకోసం పరితపించింది. కనీసం పరిచారిక చేతనైనా కబురు చెయ్యలేని దీనావస్థలో మునిగి తేలుతున్నది.

ఒక నాటి నిశిరాత్రి సమయంలో - కల్యాణి గాఢంగా నిద్రపోతున్నది. ప్రక్క మేడలోనికి ఓ ముసుగు వ్యక్తి నెమ్మదిగా ప్రవేశించాడు. ఒక ఆడగొంతుక, ఒక మగగొంతుక, గుసగుసలాడుకుంటున్నాయి.

ఇంతట్లో బయటనుండి సైనికుల కేకలు వినిపించేయి. కల్యాణి ఉలిక్కిపడి లేచింది. బయటికి వచ్చి చూసింది. ఎవరో ముసుగు వ్యక్తి పారిపోతున్నాడు ప్రక్క మేడలో నుంచి ఆశ్చర్యం! ఆ ముసుగు వ్యక్తి కల్యాణి భవంతి మీదికే దూకేడు.

సైనికులు మేడను చుట్టుముట్టేరు. ముసుగు మనిషి పారిపోడానికి ప్రయత్నిస్తున్నాడు. కానీ సైనికులు శూలంతో అతనిని హతమార్చేరు. కల్యాణిని కూడా బంధించేరు -

మరునాడు ఉదయం -

"ఎవరా ముసుగుమనిషి ?

సుల్తాను ఉగ్రుడయ్యాడు.

"నాకు తెలయదు ప్రభూ ?"

అమాయకంగా కల్యాణి సమాధానమిచ్చింది.

"ఛీ! నీచురాలా! నన్నే మోసం చేస్తావా ?"

"నేను నిర్దోషిని ప్రభూ!"

"పవిత్రమైన హిందూ మతంలో పుట్టేనన్నావు. భర్తనే దైవంగా పూజించుకుంటున్నానన్నావు. అన్ని నీతులు చెప్పిన దానివి అవినీతికి పాల్పడతావా ?"

"నన్ను నమ్మండి. నిద్రపోతున్న దాన్ని సైనికుల కోలాహలం విని లేచేను. ప్రక్కగా ఉన్న మేడపైనుంచి ఆ ముసుగువ్యక్తి నా మేడపైకి ఉరికేడు. పారిపోతుంటే వాణ్ణి సైనికులే హతమార్చేరు. నన్ను బంధించి తీసుకువచ్చేరు"

"అంతా కల్పన. హైందవ స్త్రీనన్నావు. పాతివ్రత్యమే పరమావిధన్నావు. వేరొకనితో వ్యభిచారమా ?"

"అన్యాయంగా నాపై ఈ కళంకాన్ని ఆపాదించకండి స్వామి ? నేను దోషిని కాదు"

"ఋజువు ?"

"భగవంతుడే సాక్షి"

"ఈ నేరానికి శిక్షేమిటో తెలుసా ?"

"ఉరిశిక్ష"

"అందుకు శిద్ధపడే చేశావన్నమాట"

"నేను సర్వదా మిమ్మల్నే దైవంగా పూజించుకుంటున్నాన్ను. మీరే శిక్ష విధించినా సంతోషంగా స్వీకరిస్తాను. కానీ నాపై ఎట్టి కళంకాన్నీ రానివ్వకండి"

"నామీద అయిష్టత అనేది నీకుంటే ఆ నాడే ఏ ఆత్మహత్యకైనా పాల్పడిఉందువు. అయినా నేరం సిమీద మోపబడింది. సాక్షులు, ఋజువులు, నీకు వ్యతిరేకంగా ఉన్నాయి. నిన్న నడివీధిలో నలుగురు ఎదుటా ఉరికంబానికి ఎక్కించడం నా అభిమతం కాదు. నేను నీ భర్తను. నా ఆజ్ఞను శిరసావహించే సతివే అయితే, నీ నిర్దోషిత్వాన్ని ఋజువు పరచేటందుకు ఈ విషాన్ని త్రాగు" గ్లాసును చేతికి అందిచ్చేడు ఆ కర్కశ హృదయుడు.

గడగడా త్రాగింది రాజపుత్రి.

సుల్తాను నిశ్చాంత పోయాడు.

# మతకర్తలు : తద్భక్తిభేదములు

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

(గత సంచిక తరువాయి)

---

వంగదేశ వైష్ణవమతాచార్యులు, తమ యుపదేశములకుఁ బైనుడివిన సిద్ధాంతమునే జీవగఱ్ఱగా గ్రహించి, తదనుసారము గౌరాంగుని భగవత్స్వం పూర్ణావతారముగ నిర్ణయింప బ్రయత్నించిరి. ఈ నిర్ణయము ననుసరించి, భక్తుఁడగువాఁడు మనసార ప్రేమించు పరమాత్ముఁడు, ఆభక్తుని యట్లే తన జీవసారముగ భక్తి నెందులకవలంబింపరాదు అని వాదించి, గౌరాంగుని భక్తిని వారు సమర్థింతురు. ఆధ్యాత్మికమగు భక్తి భక్తునిఁ దన్మయునిగఁ జేయును అనుట సత్యదూరముగాదు. అట్లే అది భగవంతునిఁ గూడఁ దన్మయుని జేయుననుట అసత్యముగాదు. భగవానుని తక్కిన అవతారములలో ఆయనయే తన మహాచ్ఛక్తి సంపన్నతను, ప్రభావమును మర్త్యలోకమునఁ బ్రకటించును. ఆయన మానవుని కష్టసుఖములలోఁ దన మహిమోన్నత పథమును బ్రదర్శించును. ఆయన మానవుని కష్టసుఖములతో ఏమాత్రము నిమిత్తము లేని తాటస్థ్యము వహించును. ఇట్టి భగవంతునివలన నరునకు సౌఖ్యమునునది గగనకుసుమము. భక్తుని యామోదముం గాంచి సంతృప్తి వహింపని దైవము—, అతని దుస్థితిఁ గించిత్తైన మనస్సునఁ జలింపని దైవము— వ్యక్తిత్వము గాని, కృపాపరత గాని లేని మ్రోడువంటిది. ఒకవేళ అట్టి భక్తుని విజ్ఞానవంతునిగ అనుగ్రహింపవచ్చును. ఆ పరతత్త్వపదార్థమునందలి మనుజుని ప్రేమ సంపూర్ణవికాసము నందఁజాలదు. కావున భగవంతుఁ డట్టివానిని భక్తియోగపథమునకుఁ దీసికొనిపోవ యత్నింపఁడేని, ఆయోగాభ్యాసమువలని పరమానంద మెట్లాతఁడు చవిచూడఁగలఁడు? భగవంతుఁడు సర్వసాక్షి యని నీవు వాదించుపక్షమున భక్తుఁడు కోరిన ప్రతివస్తువునందును నిండి నిబిడీకృతుఁడై యానంద మాతనికిఁ గలిగించును. అట్టి పరబ్రహ్మానందమే యతని యుద్దిష్ట వస్తుతత్త్వము. సర్వజ్ఞుఁడగు భగవంతుఁడు, ఆ జ్ఞానానుభవమునకు దూరుఁడై, యుండవలెఁగదా! భక్తాభీష్టమును అనుసరించి, భక్తుఁడుగఁ దానే యవతరించి, ఆయనుభవమును భగవంతుఁడు భక్తునికిఁ బ్రత్యక్షముగఁ గలిగింపవలెఁగదా! ఇట్టి ప్రశ్నలకు సమాధానములు మృగ్యములు. వంగదేశ మతాచార్యులును, గౌరాంగుఁడను— ఇక్కరణి వక్కాణించిరి:—

'యోగానందమును అనుభవించుటకు, భక్తివిహీనుఁడైన నాస్తికుఁడు, అసమర్థుఁడు, అనర్హుఁడు. అతఁడు ప్రత్యక్ష ప్రమాణముపైననే ఆధారపడియుండును. కేవలము భక్తియోగ సాధకులకు మాత్రమే ఆ యానంద— అనుభవము సిద్ధించును. తదన్యులకది దుర్లభము. అట్టియెడ ఆ యానందానుభూతి తటస్థుఁడుగ నుండు భగవంతుఁడును తప్పక కాంచునట్లది ఆయననుగూడ నిర్బంధించును. అప్పుడాయన మర్త్యలోకమున అవతరించియే తీరవలయును. అట్లవతారము దాల్చినచేతప్ప. దాని యనుభూతివలననే బ్రహ్మానందపదముం గని, లోకోద్ధరణార్థము— ఆ యాధ్యాత్మిక నిశ్చలానందమును చాటఁజాలఁడు. తొలుదొల్త 'భక్తి' అననేమో, తెలిసికొందము. వంగదేశ వైష్ణవమత దేశికులు, 'భక్తి' యన, వాత్సల్యము, ప్రేమ- అనుచున్నారు. 'ప్రేమ'- అననేమి? శ్రీ జీవగోస్వామి, తన భాగవత సందర్భమున 'ప్రేమ'- యననేమో ఈక్రింది రీతి నిర్వచించెను:—

"ప్రీతిశబ్దేన ఖలు ముత్ప్రమదహర్షానందాది పర్యాయం సుఖముచ్యతే। భావహార్ద సౌహృదాది పర్యాయా ప్రియతా చ ఉచ్యతే। తత్ర ఉల్లాసాత్మకో జ్ఞానవిశేషః సుఖమ్। తథా విషయానుకూల్యాత్మకః తదానుకూల్యాను గత తత్స్పృహా। తదనుభవ హేతుకో ఉల్లాసమయ జ్ఞానవిశేషః ప్రియతా।"

"సముల్లాసము, సంతృప్తి, సమ్మోదము మున్నగువానితోఁ గూడిన వాగ్వ్యాపారము మూలముగ హృదయగత దివ్యానుభవ సముపేత బ్రహ్మానంద పారవశ్యము సూచింపఁబడును. అందు తత్పదర్శనోత్కంఠ మిక్కుటమయి ఆత్మకత్యంత సంభ్రమమును వేగిరపాటును జేకూర్చుటయు జేకూర్చును. సమస్తేంద్రియము లేకోన్ముఖముగ భగవంతునిపై కేంద్రీకరించి, త్రికరణశుద్ధిగ సర్వసమ్మతముగఁ దాను

ప్రేమించు భగవదనుగ్రహమాకాంక్షించుటయు, హృత్సరోజమున నట్టి పరమదైవదర్శనాభ్యాస మొనర్చుటయు, దానిమూలమునఁ బూర్ణ నిత్యానంద సంతుష్టులందుటయు భక్తుని ప్రీతి యని, ప్రేమయని శిష్టులు వచింతురు. అతులిత అనుభవమునకు భక్తుని నడిపించును. అది అభ్యాసవశమున స్వపరభేదము లెంచని భగవత్తత్వ భక్తప్రేమల కవినాభావ సంబంధ కారణమయి బ్రహ్మానందదాయకమగును.”

అన్నిటి సమన్వయమున నేర్పడు బ్రహ్మానందమునకు ముఖ్యహేతువు ‘ప్రీతి’— ‘ప్రేమ’. అది మాయ వలన జనింపదు. అవిద్యవలనఁ గలుగదు. వానివలన దౌర్భాగ్యస్థితియు— అనిర్వాచ్యదుఃఖమును మాత్రమే. జీవాత్మని మనుగడలో నిబిడతర దుఃఖము తన ప్రాబల్యము చూపును. ఈ కారణమును బట్టియే వంగదేశములోని మతాచార్యులు ‘ప్రేమ’ను ‘హ్లాదిని’— ద్యోతకమనియు పరతత్వముయొక్క బ్రహ్మానందరూపమనియు నందురు. ‘హ్లాదిని’— యనునది, భగవంతుని వ్యక్తిపరమయినదియు స్వతస్సిద్ధమయినదియు నగు అంతర్ముఖమగు మహచ్ఛక్తి. అవిద్యయు అతని శక్తియే. అవిద్య తనస్వాధీనమునందే యుండి— అసహజముగఁ గలిగియున్న స్వభావము నెల్ల నిశ్చయతత్వమును గప్పిపుచ్చుటకు ఉపయోగించును. అంతియ గాక దానికి వాస్తవముగ నుండు సత్స్వభావమును మిాఱి చరించును. ఇందుల కొక నిదర్శనముం గనుఁడు, ముత్యపుఁజిప్ప నిజస్వరూపమును అవిద్య కప్పిపుచ్చును. అట్లే త్రాటియొక్క వాస్తవికతయు దాఁచివేయును. అంతమాత్రముతో దానిచర్యలు మానదు. ముత్తెపుఁజిప్పను వెండిగను, త్రాటిని సర్పముగను జూపునట్లుగఁ దోఁపఁజేయును. ఆవిధముగనే మనము వానిని జూచి తీర్మానించుకొనుటచే, వివేకరహితులమగుదుము. ప్రాపంచిక విషయములసందర్భమున మన మారీతిగనే వివేచనలేని వారమయి భవబంధనములకుఁ గట్టుపడుచున్నాము. అవిద్యవలెనే ‘హ్లాదిని’ భగవచ్ఛక్తి జీవాత్మయొక్క విషయైక శక్తిని వెలుపలికి గోచరింపనీయదు. కాన అంతశ్శక్తి విజృంభణము నణఁపఁజాలదు. ఆ కారణమువలననే అది అవిద్యవలె దుఃఖకరము గాదు. అంతియ గాక, జీవాత్మయొక్క అంతశ్శక్తి ప్రభావముచే ఆనందము ఉప్పతిల్లును. ఈరీతి అవిద్యాహ్లాదినులొండొంటికి భిన్నములయినవి. జీవగోస్వామి హ్లాదినీశక్తి నిట్లు వివరించెను :-

“యయా శక్త్యా భగవాన్ స్వయమానన్దస్వరూపోపి స్వమానన్దం స్వయ మనుభవతి అన్యాంశ్చ సర్వాన్ జీవాన్ అనుభావయతి, సా, శక్తిర్హ్లాదినీ నామ.”

బ్రహ్మానందస్వరూపుఁడగు భగవంతుఁడు, ఆ బ్రహ్మానందమును తానే ఏశక్తిచే అనుభవించునో, తదనుభవానంద మన్యజీవులకుఁగూడ చవిచూపునో అదియే హ్లాదిని అనఁబడును.

హ్లాదినీశక్తి సంపూర్తిగ అభివృద్ధి చెందినపుడు అదియే ‘ప్రీతి’ యని ‘భగవత్ప్రేమ’— యని అనఁబడును. జీవాత్మ పవిత్రుఁడును,— నిష్కళంకము నగు రూపుతో వెలుగారునపుడే దైవప్రేమవలని యానందము ననుభవింపనగును; లేనిచో నది దుర్లభమే. అద్వితీయము, పావనము నగు స్థితి నందినపుడు— మాయయు, హ్లాదినియుఁ దమ చర్యలనుండి విరమించును. కాని మాయవలె హ్లాదిని భిన్నశక్తులు గలది గాదు. హ్లాదినివలని పెక్కు క్రీడలను భగవంతుఁడు దానను భవించుటేగాక— తనతోఁబాటు యాధ్యాత్మిక క్రీడావిలాసములలోఁ దన భక్తులను బాల్గొనునట్లొనర్చును. దానివలని యానందము నిశ్చలము; నిర్వ్యాజమును, నిరతిశయము. ఆక్రీడలకుఁ దగిన యాటపట్టు మర్త్యలోకమందలి బృందావనము గాదు; వైకుంఠము గాదు; గోలోకమును గాదు. మహోన్నతమును, పరమపవిత్రము నయి యొప్పారు మానవుని హృదయమే ఆ యుత్తమభగవత్క్రీడలకరమగు నంగణము. అదియే బృందావనము. ఈ బృందావనమున మహోత్కృష్టమగు ప్రేమ సక్రమాభివృద్ధి యగును. ఆప్రేమయే రాధాదేవి ప్రతిబింబము.— సంతుష్టి, ఆతురత, నిర్లిప్తత, మనశ్శాంతి, వేసట మొదలగు హృదయ నైర్మల్యకారణములగు మనోభావములు— ప్రేమస్వరూప యగు రాధాదేవికి నెచ్చెలులు.

భగవంతుడు తన సంపూర్ణాంశతో బృందావని నవతరించినను— రాధాదేవి రహస్య గభీర భావాంతరంగముం జొచ్చి, భగవత్సన్నివిష్ట సాహచర్యమున ఆమె పొందిన బ్రహ్మానందపు విలువ యెంతటిదని నిర్ణయించుటకు భగవంతుఁడింకను పూనుకొనలేదు. ఆయన సర్వాంతర్యామిత్వమును మాహాత్మ్యమును హ్లాదిని పూర్తిగ నావరింపమి నాతఁడిందు విజేత కాలేకపోయెను. మిక్కిలి పవిత్రము సంపూర్ణము అగు

జీవాత్మదశ పొందిననే తప్ప ఉత్కృష్టమగు దైవ ప్రేమ ననుభవింప వీలుకాదని యీవిధముగా సూచించితి. భగవంతుని శ్రీకృష్ణావతారమున పరతత్వ (భగవంతుని) ప్రభావము సంపూర్ణముగ 'హ్లాదినీ' శక్తి ఆవరింపఁజాలదు. కాన ఆభగవదవతారమునఁ దన మనస్సులో మెలఁగు భక్తుడైనను భగవంతుఁ డట్టి వ్యక్తియొక్క బ్రహ్మానందమును బరోక్షముగనే రుచి చూడఁగలఁడు. ఆ పరమాత్ముఁడు పరమాత్ముఁడుగనే తాటస్థ్యము వహించి, అంతియు నంతకుండ ప్రకాశించును. కాని భక్తునిస్థితికి రాఁజాలఁడు. ఆయన శ్రీచైతన్యుఁడుగఁ గానఁబడినప్పుడు, అతని దైవస్వభావమును 'హ్లాదిని'- సంపూర్ణముగ ఆవరించును. అపుడు తన భక్తుఁ డెట్టిపరమానందమును అనుభవించునో అట్టిదే, తానును అనుభవింపవలెనను ఆకాంక్షతో నుండు భగవంతుని కోరిక ఈడేరును. తన నీలమేఘాకారము దాఁచి, అమానుష (మానవాతీత) శక్తి, ప్రభావములనుండి విరమించి, రాధాదేవియొక్క కాంతిలో లీనమయి, యామె యభిప్రాయము ననుసన్ముఖుఁడగును. ఆదర్శభక్తుఁడగు ఆభగవంతుడే లోకమనుసరించు విధమున నడుచుకొనును. అట్లు ఆయన ఉత్కృష్టమగు భక్తియోగ విధానమును బ్రపంచమునఁ బ్రకటించును. అట్టిభక్తి యోగము ఎల్లరకు సాధింప రానిది. వంగదేశ వైష్ణవమతాచార్యులు, శ్రీకృష్ణ చైతన్య మహాప్రభుని యత్యంతాద్భుత జీవిత రహస్య పేటిక యొక్క తాళముదీయు తాళపుఁజెవిని మన చేతికొసంగిరి. ఈ యవతారమున భక్తిసామ్రాజ్యమును వ్యాపింపజేయు సాధనము గౌరాంగుని యానంద భాష్యములచాలే, కాని సుదర్శనచక్రము గాదు. ఆదర్శ భక్తియోగ సాధకుఁడుగఁ బైహేతువున భగవంతుఁడు తన్నుతానే యర్చించును. ఆదర్శ భక్తుఁడుగఁ దానే బ్రహ్మానందమును జీవాత్మానందమును ఒండై ప్రకాశింపఁజేయుచు అద్వితీయుఁడు వెలుఁగొందును. తఃయాత్మయుఁ బరమాత్మయు ఏకీభవించి, మానవసాధ్యమగు నిశ్చయతత్వ వేతృత్వమున మహోన్నత పదమును బ్రాపించును. వంగదేశ వైష్ణవమతమునకుఁ బట్టుఁగొమ్మ యగు- 'గౌడీయమతము' పైవిషయముననే ప్రచారమొనర్ప నేర్పడినది. ఆధ్యాత్మిక బలహీనులు వినమ్రత గలవారికి ఈసిద్ధాంతము ననుసరించి శ్రీకృష్ణచైతన్యుఁడే ఇష్టదైవము; ఇలవేల్పు. తద్భక్తులు అతనిందప్ప మరొకదేవుని గొల్చుట కంగీకరింపరు. ఈవిషయము మిగుల నిగూఢముగ నుంచుకొన్న వంగదేశవైష్ణవమతాచార్యులు- "శ్రీగాధాయాః ప్రణయమహిమా" అను శ్లోకము బలముగ వెల్లడించిరి.

---



---

# నిత్య గోల - నెల గోల

శ్రీ వి. విశ్వనాథమ్



"సౌఖ్యానికీ, సౌభాగ్యానికీ సుందర కాండ నిత్యము పారాయణ చేయ కూడదూ" ఇంటి యిల్లాలు పొయ్యి విసురుతూ, కళ్లలో పొగపడకుండా చీర కొంగుతో తుడుచుకొంటు పోరుతోంది.

"రామనామం నిత్యము జపంచేయ మన్నాడు గాంధీజీ" అని గొణుగుతూ గడ్డంసామానులు సర్దుకున్నాడు ఇంటి యజమాని మాధవయ్య. "చెప్పినవీ, చదివినవీ చేయడానికి కలకత్తాలో కాలం చాలవద్దూ" మాధవయ్య ధోరణి సాగుతూనే ఉన్నది.

మాధవయ్య కాలకృత్యాలు నెరవేర్చి కొళాయి దగ్గరకు వెళ్లేసరికి టక్కున ఒక బొట్టూకూడ పడకుండా పోయింది.

"శంభు ప్రసాదుగారూ! మీ కొళాయి, కాస్త ఆపుదురూ – టైము అయిపోతున్నది, స్నానం చెయ్యాలి."

"మాదీ అలాగే నసుగు నసుగుతూ ఉంది, మాధవయ్యగారూ!"

మూడో అంతస్తు (Flat)లో ఉన్న మీనన్, అయిదో అంతస్తులో ఉన్న అమర్‌నాథూ కూడా స్నానాన్ని సాయంకాలానికి వాయిదా వేసి సూటుసవరించుకొంటూ సవారికెదురు చూస్తూ ఉన్నారు.

కాపరం పెట్టిన ఈ కొద్ది సంవత్సరాల లోను, కాళ్లు అరిగేటట్లు తిరిగి కాళ్లా వేళ్లా పడి కావలసిన అద్దెయిచ్చి సంపాదించిన యిళ్లలో ఇది ఆరవది.

కార్పొరేషను పన్నులు జాస్తి వేస్తాం దని నెలనెలకు అద్దె పెంచడంతో మొదటి యిల్లు ఖాళీచేయడం అయింది. "అన్నీ ఉన్నాయి ఆయుష్షు తక్కువ" అన్నట్లు అంగుపాట్లు అన్నీ ఉన్నా ఎండా వానల వివక్షత లేక ఇంట జొరపడుటచే ఇల్లు విడువక చేసేదేంగనుక!

సలాములు బ్రోకరేజిలు ఇచ్చికుదుర్చు కొన్న ఈ యిల్లు ఆరవది. ఋణానుబంధం ఎన్నాళ్లో - మాధవయ్యకీ, మీనన్‌కీ, అమరనాథ్‌కూ ఈ యింటితో.

కలకత్తాకి 'కూ్య' పనికిరాదు. కూ్య పద్ధతి కావాలి అన్నజనం అంతా జమకూడి "డబల్ డెకరు" లో దూరంగా ఉన్న ఆఫీసులు చేరుకొన్నారు.

ముంజేతివాచి ముప్పావుగంట ముందు పెట్టుకొని ఉడికీ ఉడకని మెతుకులు ఉదరంలో వేసుకొని విశ్వప్రయత్నంపైన బస్సు ఫుట్ బోర్డు మీద వ్రేళ్లాడుతూ, ఉద్యోగపు వీధి చేరుకొనేసరికి వేళ అయిపోయింది.

మాధవయ్య, ఆఫీసులో అడుగుపెట్టేడో లేదో 'అయిదు నిమిషాల ఆలస్యమన్నారు. పిచ్చాపాటీ పురాణం అవుతూనే ఉంది, ఆఫీసరు ఆర్డరు అయిందని కబురు.

(137 వ–పేజి చూడుడు)

# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

(గతసంచిక తరువాయి)

## 17

రామచంద్ర వెళ్ళిపోగానే నిరుపమకు యేదో పెద్ద దెబ్బ కొట్టినట్లయింది. అంతా ఆలోచించింది. అందంగా కన్పించడంకోసం అనేకరకాల వేషాలు వేస్తూవుంటారు. ఆ బాహ్యసౌందర్యాన్నే చూచి మోసపోతారు అందరూ - కాని ఆత్మసౌందర్యాన్ని గురించి యెవ్వరూ ఆలోచించరు. అందుకు ప్రయత్నించరు కూడ. పర్దా వేసుకున్నంత మాత్రాన అవినీతిని చెయ్యరంటామా? ఏ సమాజపు రీతులవలన కుమార్ లాంటి చదువుకున్న వాళ్ళకు బాధలు కలుగుతున్నాయో వాటినే అందరూ సమర్థిస్తూవుంటారు; అతడనుసరిస్తున్న ఋజుమార్గాన్ని అనుమానించారు. విమర్శించారు. అతణ్ణి అపహాస్యంచేసి అవమానించి. కులంలోంచి వెలివేశారు. నీతి నియమాలు యెక్కడున్నాయి యీ రోజుల్లో. ఎవ్వరూ అతనికి సహాయం చెయ్యలేకపోయారు. ఎవ్వరైనా చేస్తామని ఆశచూపినా అక్కడకూడా అతనికి నిరాశే యెదురొచ్చింది. అయినా, ఓర్పుతో నిలబడితే భూకంపం వచ్చినా చలనమనేది వుండదనడానికి కుమార్ బవే ఉదాహరణ. కాలానికి తగ్గగుణాలు అతనిలో అయినా నీతినియమాలు తప్పలేదు. తాను జమీందారిణి. కష్టాల్లో వున్నవారికి సహాయం చెయ్యడమే తన కర్తవ్యం.

వారితో స్నేహం చెయ్యాలనే తన కోరిక. వాళ్ళు క్షుద్రజీవితాల్ని గడుపుతున్నారు. తన గొప్పతనాన్ని కూడ మరచిపోయి వాళ్ళను తనలో కలుపుకోవాలి. కాని నాలుగువేపులనుండి యీ ధర్మమనేది విషపు చూపులతో చూస్తోంది. అతడు చదువుకున్నవాడైనా వీటికన్నిటికి ఓర్చి మాట్లాడక ఊరుకున్నాడు. ఎవరు ఏమన్నా యేంచేసినా అతడు లక్ష్యపెట్టలేదు... నాలుగువైపుల గట్లువేసి బంధింపబడివుంటే దాన్ని తటాకమంటారు. ఆ నీటికి చలనమనేది లేదు. అదే నీటిని నదిలోకి వదిలి పెట్టినట్లైతే దాన్ని నదీ జలమంటారు. సముద్రంలోకి వదలిపెట్టితే సముద్రపు నీరు అంటారు. అంతేగా. దేనికైనా స్థానాన్నిబట్టే విలువ యిస్తూ వుంటారు. యెక్కడున్నా వస్తువు ఒకటే.

ఆమె హృదయంలో యేదో ఆవేశం రేకెత్తింది. తాను కుమార్‌ను ఆశించింది. అతను ఆమెను చూచాడు, కాని అతడు ఆమెను ప్రేమించినదీ లేనిదీ ఆమెకు తెలీదు. తానుమాత్రం - అతడు మొదటి చూపులోనే తనను ప్రేమిస్తున్నాడనుకొంది. అందువలననే తాను అతణ్ణి ప్రేమిస్తోంది. ప్రపంచంలో ఆశించిన వస్తువు దొరక్కపోతే దాన్ని గురించి ఆనందంతో హృదయాన్ని నింపుకుంటారు... యామినీబాబు తనకు పెద్దసమస్యగా తయారయ్యాడు. కుమార్‌బాబు చదువుకున్నవాడై వుండి యామినీబాబు యింటికి బూట్‌పాలిష్ చెయ్యడానికే వెళ్ళాడు. ఎంత ఆదర్శం! బ్రాహ్మణులు కదా అని చిన్నమెత్తు గర్వమైనా లేదు. యూనివర్శిటీలో ఉద్యోగమెక్కడ యీ బూటుపాలిష్ యెక్కడ? పరిస్థితులకు తగ్గట్టు అన్వయించుకునే శక్తి అతనిలో వుంది. కాని యామినీబాబు పయోముఖవిషకుంభం.

కుమార్ అవివాహితుడు. కాకపోయినా యిబ్బందిలేదు. తాను కోరేది అతడి హృదయాన్ని. మనస్సు అంగీకరించని వాళ్ళని యెందుకు చేసుకోవాలి?

తాను మొదట కుమార్‌ను చూచినరాత్రి తిట్టిన తిట్లు జ్ఞాపకం వచ్చాయి. ఆలోచించింది. పాడిన వాడు కుమారే అయివుంటాడు. ఎంత చతురుడు! ఆనాడు తాను బైటికి రాగానే మౌనం వహించాడు... ఒకవేళ అతన్ని కల్సుకుంటే తప్పాని నన్నేమో కూతురులాగానే అనుకుంటుందామె. అందుకనే రమ్మనమని పిల్పించిందామె. నేనే వెళ్ళలేకపోయాను... అదే బలహీనత్వమేమో? వెళ్ళకపోవడం మంచిది కాదు. అయినా భర్తను పలుకరించడానికి సిగ్గెందుకు? అందుకే చిత్రాలలోను, పురాణాలలోనుకూడా

ఆధారాలున్నాయి. వాళ్లని తప్పకుండా కలుసుకోవాలి. మరి అన్నయ్య? ఏం? ఉంటేయేం? అతని యెదురుగా యెందుకు తలవంచుకోవాలి? ఏదైతే ఉచితమైనదనుకుంటామో అది చేయడానికింత భయమెందుకు? వాళ్లింకా వెళ్లివుండరు. తప్పకుండా వెళ్లాలి. ఇప్పుడు వాళ్లను రమ్మనమంటే బాగుండదు. జమీందారీ అనే గర్వం వాళ్లకు కనిపిస్తుంది. పైగా మనవాళ్లే నేరస్థులయ్యారు. అత్యాచారాలన్నీ యిటువైపే జరిగాయి. వాళ్లు వీటి నన్నిటిని సహించి వూరుకున్నారు." అనుకుంటూ ఆలోచించి దాసీదాన్ని పిలిచి నీలిని పిలువమంది.

సాయంకాలం రామచంద్ర వచ్చిన తర్వాతనే కుమార్ బాబు వచ్చినట్లు నిరుపమకు తెలిసింది. రామచంద్ర రాకముందే నీలి వాళ్లింటికి వెళ్లింది. తన మనసులోని మాటలన్నీ చెప్పేసి, వాళ్ల సంగతులన్నీ అడిగింది. ఈ నీలిమాటలు చూసి సావిత్రిదేవికి దుఃఖంలోకూడ నవ్వొచ్చింది. వాళ్లతోబాటే నీలి అక్కడ భోజనం చేసేసింది. మాటల ధోరణిలో అడిగింది సావిత్రీదేవి "మేము బీదవాళ్లమని రాలేదా మీ అక్కయ్య?" నీలి నవ్వి వూరుకుంది. సావిత్రీదేవి మళ్లీ రెట్టించి అడిగింది— "నువ్వే మీ అక్కయ్యను రావద్దన్నావని అందరూ అంటున్నారు."

"నేనేం చెప్పలేదు. నేను రమ్మనే చెప్పాను. మా అన్నయ్యకూడ వెళ్లమని చెప్పాడు. ఎందుకో ఆమె రాలేదు."

కుమార్ నవ్వి వూరుకున్నాడు. సావిత్రీదేవి చాలదూరం ఆలోచించి "మీ అన్నయ్య ఏమైనా జ్యోతిష్కుడా?" నవ్వుతూ అంది. "నువ్వెప్పుడైతే 'వెడతాను అన్నయ్యా' అన్నావో అప్పుడే మీ అక్కకూడ వెడుతుందని తెలుసుకున్నాడు. నేను రమ్మన్నానని నువ్వు చెప్పినప్పుడు మీ అన్నయ్య సందిగ్ధంగా చెప్పాడు కదూ వెళ్లమని?" - అంది. నీలి మాట్లాడకుండా వూరుకోవడంవల్ల ఆమె అనుమానం బలపడింది.

ఆ విధంగా వాళ్లు సావధానంగా కూర్చుని మాట్లాడుకుంటుంటే దాసీవచ్చి నిరుపమ పిలుస్తోందని నీలిని తీసుకుపోయింది. అక్క పిలుస్తోందనేసరికి నీలికి భయమేసింది. మాట్లాడకుండా అక్క దగ్గరకు వెళ్లి "ఏం అక్కా పిలిచావా?" అంది.

"ఎక్కడికి వెళ్లావు?"

"కుమార్ బాబు దగ్గరికి"

"అక్కడేమైనా లడ్డులు పంచిపెడుతున్నారా?"

నీలి సందిగ్ధంగా అక్కగారి ముఖంలోకి చూచింది. ఏ అభిప్రాయంతో అక్క ఆమాట అందో ఆమెకర్థం కాలేదు. నిరు నవ్వి "కుమార్ బాబుతో యేం మాట్లాడావేమిటి?" అంది. నీలి నవ్వి వూరుకుంది.

"అసలెందుకెళ్లావు అక్కడికి?"

"ఎందుకు వెళ్లకూడదు?"

"అయితే యేం మాట్లాడావో చెప్పు...కుమార్ బాబు యేమన్నాడు?"

"మా జమీందారిణి చెల్లెలు వచ్చిందన్న మాట" అన్నాడు.

"ఇంకా..."

"ఏముంది — 'ఊళ్లో వాళ్లందర్నీ పలుకరించింది - కాని మనతో ఒక్కమాటైనా మాట్లాడలేదు' అంది ఆవిడ. మాలిక్యా తల్లినికూడ వాళ్లు తీసుకెడుతున్నారట. కుమార్ బాబు అడ్రసు అడిగాను..."

నిరు మనసులోనే సంతోషించి, "యేమన్నాడు?"

"57, లాటూస్ రోడ్"

"ఇంకా యేమిటి విశేషాలు?"

"ఇన్నిసార్లు చెప్పినా నువ్వు వాళ్లింటికి రాలేదని బాధపడింది ఆవిడ. వస్తావని చెప్పాను."

"నేను వస్తున్నానని చెప్పావా? నాన్‌సెన్స్."

"లేదు లేదు — నేను చెప్పాను — 'నేను మా అన్నయ్యతో చెప్పాను — అన్నయ్యకూడ అక్కను వెళ్లమన్నాడు' అనేసరికల్లా 'అయితే మీ అక్కయ్యెందుకు రాలేదు'? అంది.

ఆమాటతో సిగ్గుతో పాతుకుపోయినట్లైంది నిరుపమకు. వెడదామనే అభిప్రాయం కలిగింది. నీలి చెయ్యిపట్టుకొని మెల్లిగా నలుపుతూ "ఇంకా ఇది

"ఏం చెప్పిందో?" అనుకుని, "ఇంకా ఏం చెప్పాడు?" అంది.

"ఏంలేదు. నన్ను అన్నం తినమని బలవంతం పెట్టాడు. కాని తానుమాత్రం తినలేదు. స్టేషను దగ్గర తింటాడట. ఇక్కడ తింటే నీళ్లు కావద్దూ?"

## 18

తల్లిని, తమ్ముణ్ణి, మాలిక్యా తల్లిని తీసుకొని కుమార్ లక్నో వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు గ్రామంలో యెవ్వరినీ కల్సుకోలేదు. ఎవ్వరితోను చెప్పలేదు. అసలతను మొదటనుండీ అంతే.

కుమార్‌బాబు విదేశాలకు వెళ్లకముందు తండ్రి బ్రతికివుండగా — ఒక ధనవంతుని యింటి అల్లుడయి సుఖంగా వుండమంటే - అట్లా కాదు; విదేశాలకు వెళ్లి చదువుకుని రమ్మనమంది తల్లి. విదేశాలనుండి వచ్చిన తర్వాత వివాహం చేసుకోవచ్చునని ఆమె ఉద్దేశ్యం. పిల్లనిస్తానన్న ఆ జమీందారు మాత్రం డబ్బుకోసం ధర్మాన్ని విడనాడేవాడు కాదు. అందువల్ల పిల్లవాడు విదేశాలకు వెడితే తన పిల్లను యివ్వనన్నాడు.

కుమార్ విదేశాలనుండి తిరిగి రాగానే యీ సనాతన హిందూ సమాజంలోని కల్మషాలను, కల్పితాలను పోగొట్టి సంఘాన్ని సంస్కరించి పీడితప్రజలకు సహాయసానుభూతులు చూపించాలని యెన్ని ఆశలు పెట్టుకున్నాడో — యీ గడ్డమీద కాలు పెట్టగానే తన ఆశలన్నీ అడియాసలై ఊహాసౌధాలన్నీ పేకమేడల్లా కూలిపోయి, నిస్సహాయుడై, నిస్పృహతో, నిరాశతో తనలో తానే కుమిలిపోయి, యెవ్వరికీ మోసం జరగదనే యీ వృత్తిలోకి దిగాడు. నడిరోడ్డుమీద తనపని ప్రజలందరూ చూడడం మొదలుపెట్టారు.

తల్లి వుత్తరం అందింది. చదువుకున్నాడు. అయినా జమీందారు మీదకాని ప్రజలమీద కాని అతడికేమాత్రం కోపం రాలేదు. ఒక్కమాట కూడ అనలేదు. నూతిలో నీరుకూడ తోడుకోనివ్వకపోతే యిక అక్కడ బ్రతకటం కష్టమే. తల్లిని, తమ్ముణ్ణి తీసుకు వచ్చేద్దామని బయల్దేరాడు. ఈ బూటుపాలిష్‌వల్ల బోలెడు డబ్బు సంపాదించవచ్చు. తానుచేసే యీ పనివల్ల తన వంశానికే కళంకం వస్తుందని తన తల్లికేమీ విచారంలేదు; ప్రస్తుతానికి తమ్ముడికేమీ యిబ్బందిలేదు. భవిష్యత్తు ఆశాజనకంగానే వుంటుందని అతడి ఆశ. ఇక యెటొచ్చి మాలిక్యాతల్లి సంగతే అతణ్ణి బాధపెట్టుతోంది. ఆమెకేమీ లోటు లేకుండా జరగాలి. ఆమెకు గ్రామంలో చాల కష్టంగా వుండేది. కొడుకు చనిపోయినప్పటినుండి తన తల్లే ఆమెకు తిండిపెట్టి పోషిస్తూ వచ్చింది. తల్లిని తీసుకుని తాను గ్రామమునుండి వచ్చేటప్పుడు మాలిక్యాతల్లి రానని బలవంతపెట్టినా — గ్రామంలో బ్రతకడం ఆమెకు దుర్లభంగా వుంటుందని - కూడా తీసుకువచ్చారు. అందువల్ల ఆమెకిప్పుడు యెటువంటి యిబ్బంది కలుగకూడదు.

లక్నో నగరంలో కుమార్ పేరుపొందాడు. తన మామూలు డ్రెస్సుమాత్రం మానలేదు. అతణ్ణి గురించి ప్రతివాళ్లు చెప్పుకుంటున్నారు. ప్రతి యింట్లోను అతనిమాటే. "విదేశాలకు వెళ్లి బాగా చదువుకుని వచ్చాడు. ప్రజలకొక గుణపాఠం నేర్పాడు" అన్నారు అందరూ. అతడు ఎక్కడికి వెళ్లినా అందరూ ఆశ్చర్యంతో చూచేవారు. అతడు యీ వృత్తి మొదలుపెట్టిన నాటినుండి మామూలుగా మాదిగవాళ్లుండే చోట రద్దీ తగ్గిపోయింది. వాళ్లందర్నీ ప్రజలు ఏహ్యదృష్టితో చూచేవారు. ఆ బజారులో కుమారంటే చాల గౌరవం. నగరంలో వున్న ఇంగ్లీషు వాళ్లందరూ అతని వద్దకే వచ్చేవారు. చాలసేపు అతనితో కబుర్లు చెప్పుతూ నిలబడేవారు. కుమార్ కూడ తీరికసమయాల్లో వాళ్ల యిళ్లకు వెళ్లేవాడు. అందరి పరిచయంవల్ల అతడికి రాబడి యెక్కువైంది.

ఒకరోజు సాయంకాలం కుమార్ తన సరంజామా అంతా తీసుకొని ధనవంతులు వున్న వీధిలోకి వెళ్లాడు. ఒక గుమ్మంలో కమల బాగా అలంకరించుకుని నిలబడింది. చూడగానే లక్షాధికారి కూతురనుకుంటారు. గుమ్మంలో నిలబడి ఆకాశంలో మేఘాలవైపు చూస్తోంది. చదువుకున్నదానిలాగానే వుంది. దగ్గరగా వచ్చిన కుమార్‌వైపు దృష్టి మళ్లించి రెప్ప వెయ్యకుండా చూస్తూ నిలబడింది. ఆమె తనవైపు చూచేసరికి "బూటు పాలిష్ చేయిస్తారా?" అని ఇంగ్లీషులోనే అడిగాడు. "బాగుంటేనే డబ్బివ్వండి... ఎంతో కాదు" అన్నాడు. భావయుక్తమైన కళ్లతో కమల అతణ్ణి చూచి ఆలోచించింది. "వీడు మాదిగాడా? బాగా చదువుకున్నవాడిలా కన్పిస్తున్నాడు... ఇతడు మాట్లాడే భాషనుబట్టే అందరూ యితనివద్దకే వస్తున్నట్లుంది" అనుకొని "నీ పేరు యేమిటి?" అంది హిందీలో.

'కృష్ణకుమార్' అని నమ్రతగా చెప్పాడు.

(సశేషము)

# రాజకుమార్


ఫ్రెంచి మూలం :
అంటోనిడె సయింట్-ఎక్సుపేరే

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎన్. శర్మ




## ఇంతవరకు నడిచిన కథ

[రాజకుమార్ ఇతర నక్షత్రమండలాలలో నొక దానినుంచి ఈ లోకపు సంగతులని తెలుసుకోటానికి వచ్చిన బాటసారి. తన ప్రయాణంలో అబ్బాయి ఎంతో మందిని చూశాడు. వాళ్లని గురించి ఎన్నెన్నో కథలని గాథలని 'విన్నాడు ... ఇలా ప్రయాణం చేస్తూ ఒక రోజున సహారా ఎడారిలో ఒక పైలట్‌ను కలుసుకున్నాడు. ఆయన అబ్బాయికి బాగా నచ్చాడు. అంచేత వారం రోజులనుంచి ఆయన దగ్గిరే వుండిపోతూ తన ప్రయాణపు సంగతులని అబ్బాయి చెప్పసాగాడు. పైలట్ తెచ్చుకున్న నీళ్లు అయిపోయాయి. మంచి నీళ్లకోసం యడారిలో వెదుకుంటూ ఒక నూతి తగ్గరకి అబ్బాయిని వెంటబెట్టుకుని ఆయన వచ్చాడు. తరువాత కథ ఎలా సాగిపోతుందో ఇక చదవండి.]

"వీళ్ల హడావుడి చూస్తూవుంటే ఎంతో ఆశ్చరం వేస్తూవుందే! ... ఆ ఆ ఎక్స్‌ప్రెస్ బండ్లల్లో కూర్చున్న వాళ్లు ఎందుకలా అటూ ఇటూ చూస్తూ వుక్కిరిబిక్కిరయిపోతూ వుండటం? ... ఇంతకూ వాళ్లు ఎక్కడికి చేరుకోవాలని ... ..." అని రాజకుమార్ గుక్క తిప్పకుండా చెబుతూ చట్టున ఆగిపోయాడు, ఎందుకలా ఆగిపోయాడో ఎలా తెలుసుకోటం? ... అలా ఆగిపోయినవాడు కొంచెం వూపిరి పీల్చుకోటానికి అవకాశం తీసుకుంటేగా! నాకేసి ఏదో విరాగికి మల్లె పెదిమలని చప్పరిస్తూ చూస్తూ "అంత వుక్కిరిబిక్కిరై పోతూవున్నా, ఇలాటి ప్రయాణాలకోసం వందలకొలది మొత్తాలని ఖర్చుపెడుతూవున్నా ..."అని ఏదో చెప్పబోతు చప్పున ఆగిపోయి ఆకాశంకేసి చూడసాగాడు

అప్పటికే మేము చేరుకోవాలసిన నూతి దగ్గరికి గబగబ నడుస్తూ చేరుకున్నాము, ఆ నుయ్యి, ఇలాటి ఎడారి ప్రదేశాలలో వుండాలసిన నూతులకుమల్లె కనబడటలలేదు. ఎడారులలో వుండే నూతులని నూతులనటానికన్నా ఇసుకలో తీయబడ్డ గొయ్యిలని అనవచ్చు. కాని మాకు ఇప్పుడు కనబడ్డ నుయ్యి సామాన్యంగా మనం పల్లెటూళ్లల్లో చూసే నూతులకిమల్లె పెద్దదిగావుంది, ఇది సహారా ఎడారి! వందలకొలది మైళ్లు నడిచినా గ్రామమనేది కలికానికైనా కనబడటం బ్రహ్మాండం. అలాటి చోట్ల ఇలాటినుయ్యి ఎలా వూడిపడ్డదో! బహుశా అలాటి నూతిని చూస్తున్నామని కలలని కుంటున్నామా మరి?...

రాజకుమార్ తను చెప్పతున్న దాన్ని ఎందుకలా చటుకున్న ఆపేశాడో ఇప్పుడు అర్థమైంది!...అబ్బాయి దృష్టి ఈ నూతికేసే! దాన్నే తదేకంగా చూస్తూ "ఇదంతా ఇంద్రజాలం మల్లే వుందే! నూతుల దగ్గర వుండాలసిన తతంగమంతా ఎలా అమర్చబడివుందో చూడు. ఇది గిలక కదూ! బొక్కెన ఎంత బాగుంది, అదిగో చేంతాడు!

దాని సంగతికూడా వాళ్లు మరచి పోయ్యారుకాదు ... " అని మందహాసం చేస్తూ నాతో అన్నాడు. దాంతో పూరక పున్నాడా? బొక్కెనను నూతిలోకి వేశాను. గిలక గిరగిర తిరుగుతూ చప్పుడు చేస్తూ పున్నది. అలాటి నిశ్శబ్ద ప్రదేశంలో అది చేసే రణగుణ ధ్వని ఇంతింత అని చెప్పాలా! అబ్బాయి ఆ శబ్దానికి విస్తుపోతూ" ఆ సందడిని వింటూన్నావు కదూ! ... దాంతో నుయ్యి బాగా మేలుకుంది. అంచేత నే కమ్మని పాటని లోపలినుంచి పాడుతూ తన కేసి చూడాలని మనలనికూడా పిలుస్తూ వుంది ... " అని అంటున్నాడు.

అబ్బాయి అసలే అలసిపోయివున్నాడు. వాడు నీళ్ళని తోడటం ససేమిరా నాకు ఎలా ఇష్టంవుంటుంది? దీన్నే వాడికి చెబుతూ "ఈ బొక్కెన బరువైంది. అసలే అలసి సొలసి వున్నావు. కొంచెం విశ్రాంతి పుచ్చుకోటం నీకు మంచిది. మనకు కావాలసిన నీళ్ళను నేనే తోడుతాను..." అని అంటూ అబ్బాయిని అలా కూర్చోమని చెబుతూ, వాడి చేతిలోని చేంతాడుని పుచ్చుకుని బొక్కెనను నీళ్ళలోకి దించాను. బాగా గాలి వీస్తూవుంది అన్ని ప్రక్కలనుంచి. అబ్బాయి చలికి గడగడ వణికిపోతూ వున్నాడు ... సూర్యోదయం అయింది. ఎడారి చోట్లలో, ముఖ్యంగా సహారా ఎడారి ప్రదేశంలో సూర్యోదయ మవట మంటే అగ్నిజ్వాలలు మనకేసి గబగబ ప్రాకిపోతూ వున్నట్లేగా!...

"దాహం! చప్పున తాగటానికి నీళ్ళను ఇయ్యాలి..." అని గావుకేకలని వేయ సాగాడు అబ్బాయి, అటు చలికి, ఇటు దానికి రెట్టింపుగా వస్తూవున్న వేడికి, ఆ రెంటి మూలాన వాడిని యాతన పెడుతూ వున్న దప్పికి ఆగలేక.

దాంతో నేను పడ్డ కంగారు ఇక మాటలతో ఎలా చెప్పగలుగుతాను? ఆదరాబాదరా నీళ్ళనితోడి బొక్కెననే వాడి పెదిమల దగ్గరనుంచాను. కళ్ళని గట్టిగా మూసుకుని దాన్లోనున్న నీటిని ఒక్క నిమిషంలో ఖాళీ చేశాడు. అమృత తుల్యంగా వుండి తీరాలి ఆ నీళ్ళు! వాడి బడలిక మాయమైపోయింది. వాడి సంతోషానికి ఇక పట్టపగ్గాలు అవసరమైతేగా! ఒక్క వాడికేనా ఆరోజు పర్వదినం! జలాన్ని పుచ్చుకోటంతో నాఅలసటకూడా మాయమైపోయిందని ఇక చెప్పాలా!...

ఇలాటి నూతులు అలాటి ఎడారులలో లేకపోతే బాటసారుల గతి ఏమైపోతుందో వూహించుకోటం అంత కష్టంకాదు కూడా. అప్పటి మాయాతనన్ని నెమరు వేస్తూవుంటే జలం పుచ్చుకున్నాక మనలో కలిగే మార్పు చెప్ప ప్రారంభిస్తే ఇంక దానికి అంతూ పంతూ అనేది వుంటుందా? ...

అబ్బాయిలో ఇలాటి మార్పుని చూస్తూ ఆశ్చర్యపోతూవున్నాను, 'ఈ లోకపు వాళ్ళు వింత వింత దోవలని తొక్కటానికి చేసే ఆర్భాటం చూస్తూవుంటే...ఒకే రకపు రోజా పూల మొక్కలని అన్ని వేయటమెందుకో? అన్నీ ఒకే తోటలో నేనా వేయటం? . అలాంటప్పుడు వాళ్ళకి కావాలసిన గులాబి పువ్వు ఎలా చూడ గలుగుతారో? పాపం! వాళ్ళ సంగతి తలుస్తూవుంటే నాకే విచారం వేస్తున్నది" అని అన్నాడు.

"అదంతా వాళ్ళ వైఖరి. దాన్ని మనం ఎలా మార్చగలుగుతాం?" అని వాణ్ణి సమాధానపరచటానికి అన్నాను.

"అంటే ప్రవాహం ఎటుపోతే అటు వెళ్ళాలసిందేనా? .... తాము అనుకున్న దాన్ని చేయటానికి ఎందుకు వచ్చిందో అంత బధకం ఈ మనుష్యులకు?" అని నిట్టూర్పు విడుస్తూ అన్నాడు రాజకుమార్.

"అలా పుట్టి పెరిగారు. అలాంటి వాళ్ళని మార్చటానికి మన తరమవుతుందా అబ్బాయీ!" అని ఆప్యాయంగా అబ్బాయి తల నిమురుతూ అన్నాడు.

అబ్బాయి బుర్రలో ఆ క్షణంలో ఏం మెరిసిందో? "కళ్ళకి చత్వారం వచ్చిందే అనుకుందాం. అలాంటప్పుడు వాళ్లు వాళ్ళ హృదయాలని చూసుకోటానికి ప్రయత్నించరా ..." అని ఇలాటి సమస్యలని తేల్చటానికి ఎలాటి మార్గాలు అనుకూలమైనవో గుక్కతిప్పకుండా చెప్పటానికి ప్రారంభించాడు.

II

అప్పటికే బాగా ఎండ కాస్తున్నది. నీళ్ళు త్రాగటానికి బాగానే వున్నాయి. దాంతో ఈ లోకంలో మనలని అస్తమానమూ ఎదుర్కొంటూవున్న కష్టనిష్ఠూరాలని మరచిపోవచ్చు. కాని అలా అక్కడే వుండిపోతే చూసుకోవాలసిన పని పాటలని ఎవళ్ళు చూసుకుంటారు? అంచేత తిన్నగా నేను వచ్చిన చోటికి వెళ్ళాలని ఆతృత పడుతూ వున్నాను...

"అప్పుడు ఇచ్చిన మాటను నిలుపుకుంటావు కదూ?" అని నాకేసి చిరునవ్వు నవ్వుతూ చూస్తూ అన్నాడు.

"అంటే!"

"నా మేకపిల్లకి చిక్కము తయారు చేసి ఇస్తానని అప్పుడు అన్న సంగతి మరచిపోయావన్న మాటేనా!.. నా గులాబి పువ్వు వెయ్యి కళ్ళతో కాపాడు కోటం అంటే అంత సులభమైన పని అనుకున్నావా?..." అని బిక్క మొహం వేసుకుని అబ్బాయి అన్నాడు.

ఆ సంగతి జ్ఞాపకం వుంది. అప్పుడే అబ్బాయి కోరిక నెరవేర్చటానికి బొమ్మలని గీచి జాగ్రత్త పరుచుకున్నాను. అదృష్టవశాత్తు గీచిన ఆ కాగితాలు నా జేబులోనే వున్నాయి. చప్పు చప్పున ఆ బొమ్మలని తీసి అబ్బాయి ముందర నుంచాను. వాడు వాటికేసి ఎగా దిగా చూస్తూ, ఫక్కున నవ్వాడు...

అందులో వాడు ఇప్పుడు కోరుకున్న చిక్కం మేకబొమ్మే కాకుండా వాడు కోరుకున్న బొమ్మలు మరి కొన్ని కూడా వున్నాయి. అబ్బాయి దృష్టి చటుక్కున రొట్టె చెట్లమీదికి పోయింది.

"ఇవేం బాగాలేవు. వీటిని రొట్టె చెట్లని అనటాని కన్నా చేమగడ్డలని అనటం అన్నివిధాలా మంచిది..."

"అలాగా!" అని ఆశ్చర్యపోతూ అన్నా. రొట్టె చెట్లసంగతి నాకు బాగా తెలుసు. వాటినే యథాతథంగా గీశానని గర్వపడ్డాను. అటువంటప్పుడు అబ్బాయి నా యీ చిత్రాలని ఇలా విమర్శించటమా!

(సశేషము)




# సాహసవీరులు

శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు

( గతసంచిక తరువాయి )

శివబంటు, హారకుమార్‌ను లోపలకు తీసుకెళ్లి పంచభక్ష్యపరమాన్నాలతో విందు చేశాడు. హారకుమార్ ఎంతో తృప్తిపొంది శివబంటు గృహస్థుడైనందుకు అభినందించాడు. ఒక జాము ప్రొద్దువరకూ హారకుమార్ యాత్రావిశేషాలు చెప్పాడు. మిగిలిన జాము ప్రొద్దువరకూ శివబంటు సాహసాలు చెప్పుకున్నాడు. ఇంకేం! తెల్లవారింది!

మర్నాడు హారకుమార్ ప్రయాణమయ్యాడు. "ఎక్కడికి?" అని అడిగాడు శివబంటు. "భార్యరాగానే అన్నీ మర్చిపోయావన్నమాట! సంచారానికి బైలుదేరు" అన్నాడు.

శివబంటుకూడా బైలుదేరుతుండగా భార్యవచ్చి వద్దని ఏడ్చింది.

"వద్దంటే ఎలా చెప్పు చిలకా! మా యువరాజుతో బైలుదేరాల్సిందే. ఇంకా విచిత్రాలుంటే సాధించుకు రావాల్సిందే" అన్నాడు.

ఇంతలో ఆమెకు చటుక్కున మెరుపు మెరిసింది.

"మీకు కావలసింది వింతలేగా!" అని అడిగింది.

"అంతే!"

"అయితే ఎక్కడిదాకానో ఎందుకూ. మా రాజకుమార్తె 'పాయిసం'ను వివాహమాడటానికి మహారాజు ఒక షరతు పెట్టాడు. ఆయన చెప్పే వస్తువు తీసుకొస్తే కూతుర్ని ఇస్తాడట. ఆ వస్తువేదో వెతికి తీసుకురండి -! ఇదొక వింతేగా!" అంది.

ఈ మాటవినగానే శివబంటు గుర్రంమీదనుండి దిగి-"యువరాజ! ఆమె పేరు 'పాయిసం' ట. ఇంకేం జుర్రుకోండి. ఎక్కడిదాకానో పోవటమెందుకు?" అన్నాడు నవ్వుతూ. "సరే! కాస్సేపాగిన తర్వాత రాజమహలుకి వెళ్లి విషయం తెలుసుకొని ఆ వస్తువేదో సాధించితెస్తాను!" అన్నాడు.

"తెండీ! ఆ పిల్లను పెళ్లిచేసుకోండీ!" అన్నాడు నవ్వుతూ శివబంటు.

(7)

జయఘంట గణగణమని మ్రోగటంతో ప్రద్యుమ్న మహారాజు బయటకువచ్చాడు. హారకుమార్‌ను చూసి "ఎవరు నువ్వు? ఎందుకొచ్చావ్?" అని అడిగాడు.

"మీ కుమార్తెను పెండ్లాడటానికి వచ్చాను."

"అందుకు తగినసాహసం వుందా?"

"వుందబట్టే వచ్చాను. చెప్పండి వేగిరం!"

"చూడబోతే అసాధ్యునిలాగే వున్నావు. బంగారుచామంతిని మూడువారాల్లో సాధించుకు రావాలి! లేకపోతే శిరచ్ఛేదం!"

"మూడు వారాలెందుకు -! మూడురోజుల్లో సాధించి తెస్తాను." అని రివ్వుమని వెనక్కి తిరిగాడు.

రాజమహల్ దాటి బయటకురాగానే శివబంటు ఎదురుపడినాడు 'నేనూవస్తాను.' అంటూ

"మరి మీఆవిడ అనుజ్ఞఇచ్చిందా -!" నవ్వుతూ అడిగాడు.

"దాని మొహం దాన్నితప్పించుకొని వచ్చాను. పద!"

హారకుమార్, శివబంటూ రయ్యమని అశ్వారూఢులై వూరుదాటి అడివిలోనికి

ప్రవేశించారు. ఇలా వారు అడివిలో వెళుతుండగా ఒక చిరుతపులి వెనకనుండి వచ్చి గుర్రాన్ని కరిచింది. వెంటనే గుర్రంవారిని క్రిందపడేసి దౌడుతీసింది. చిరుతపులి వారిద్దర్నీ వీపుమీద ఎక్కించుకొని సమీపం కొండమీదికి దౌడు తీసింది. వారిని కొండచివర పెట్టి తినబోతుండగా ఇద్దరూ పైనుండి జారి ప్రక్కలనున్న అగాధాల్లో పడిపోయారు.

హారకుమార్ సరాసరి వచ్చి ముని కాళ్ళముందు పడ్డాడు. ముని మూర్ఛపోయిన యువరాజును చూసి జాలిపడి కమండలంలోని నీళ్లుచల్లి స్పృహ తెప్పించాడు. హారకుమార్ లేచి మునికి నమస్కరించి తాను బైలుదేరినపనిని మనవిచేశాడు.

"బంగారు చామంతి కావాలా! అదికనపడటం సులభంగానే సమకూరుతుంది. దానిని పొందటం మటుకు కష్టటమైనపని. ఇదిగో అటుచూడు, ఆ కనబడే అరణ్యంలో ఒక పెద్దమర్రివుంది. ఆ మర్రిమీద ఒక దయ్యం వుంది. దాన్ని వేధిస్తే మీకు బంగారు చామంతి దొరుకుతుంది.?" అన్నాడు.

హారకుమార్ మునివలన దీవన పొంది బయలుదేరాడు. హారకుమార్ సరాసరివచ్చి మర్రిమీద తిష్టవేశాడు. అర్థరాత్రి ఆయేసరికి దయ్యంవచ్చింది. పైనకూర్చున్న యువరాజునిచూసి భయంకరంగా గర్జిస్తూ - "దిగుతావా! దిగవా! లేకపోతే నిన్ను చంపేస్తా -" అంది.

"దిగను!" అన్నాడు.

దయ్యం వెంటనే చెట్టునెక్కి అతనిమీదికిదూకింది. అతడు వెంటనే ఆపట్టు తప్పించుకొని దానిజుట్టు పట్టుకొని వ్రేలాడాడు. ఆ దెబ్బతో దయ్యంలొంగిపోయి.

"నీకు పుణ్యముంటుంది, - నాజుట్టు వదులు!" అంది.

"చెప్పు 'బంగారు చామంతి' ఎక్కడుందో"

"బంగారుచామంతి ఆకనపడే వుద్యానవనంలో వుంది. నీవు సరాసరి వెళితే పూలు పాములై నీవెంట పడతాయి, అంది."

"అయితే ఏంచెయ్యాలి. ఆసర్పాలు సమసిపోవటానికి?" అని అడిగాడు.

"ఇదిగో ఈ భస్మం తీసుకో. దీన్ని ఆపుష్పాల మీద చల్లు!" అని ఇచ్చింది.

"సరే" నని భస్మంతీసుకుని దానిజుట్టుపట్టి లాగాడు, జుట్టువూడిరాగానే దయ్యం విలవిలలాడి ప్రాణాలువదిలింది.

హారకుమార్ భస్మంతీసుకుని చామంతి దగ్గరకు వెళ్లాడు. ఆ చెట్టుకొకే చామంతిపూవు వుంది. మిగిలినవన్ని చిన్నపూలు భస్మంచల్లకుండా ముట్టుకోపోయేసరికి బుస్సుమని కరవ వచ్చినై సర్పాలు. వెంటనే పాములమీద బస్మంజల్లగానే మాయమైపోయినాయ్.

వెంటనే బంగారు చామంతి అతనిదోసిలిలో వ్రాలింది.

దాన్ని తీసుకుని అతడు బయలుదేరాడు.

♦ ♦ ♦

శివబంటు అలా వేరుగా అగాధంలో పడిపోయిన వెంటనే సరాసరివచ్చి ఒకబుట్టలోపడిపోయాడు. కండ్లు తెరచి చూచేసరికి బూరెలబుట్టలో వున్నాడు. ఒంటెనిండా బూరెలు అతుకుతున్నయ్.

ఇంతలో ఒకపడుచు అక్కడికివచ్చి - "ఎవరు నువ్వు ఇక్కడికెలావచ్చావు?" అంది.

శివబంటు జరిగిన సంగతంతా చెప్పాడు.

ఆమె ఎంతో విచారంగా "అయితే నీగాధకంటే నాగాధే నయమన్నమాట!" అంది.

"ఏమిటి నీ గాధ" అడిగాడు.

"ఏమని చెప్పమంటావ్! మాది విఠలపురం నేను సామాన్య కుటుంబంలో పుట్టాను. ఒకసారి నేను మల్లెపూవులుకని ఒంటరిగా తోటకువెళ్లాను. ఈ రాక్షసి నన్ను తెచ్చి తనదాసిగా చేసుకుంది. విడిపించే నాధుడులేక ఇలాపడివున్నా! అంది ఏడుస్తూ

"నేనున్నాగా దాని ప్రాణం ఎక్కడుందో కనుక్కో!" అని అడిగాడు.

"దాని ప్రాణం దానివ్రేలివుంగరంలోనేవుంది. ఈ రాత్రి అది నిద్రపోతున్న సమయంలో నేను తలుపుతీస్తాను. వెంటనే వచ్చి వుంగరంవ్రేలిమీద రాతితో బలంగా కొట్టు. ఉంగరం రాలుపగలగానే దాని కళ్లుపోతాయ్ ఆతర్వాత దాని ప్రాణం తీయటం సులభం!" అంది.

"ఇంతకూ నీ పేరేమిటి?"

"నన్ను 'మిఠాయిపొట్లం' అంటారు" అంది చిర్నగవుతో.

'అయితే ఇంకేం మిఠాయి పొట్లం నాక్కావాలి'

"ఏడిశావుగాని ఇలామూలకూర్చో. రాక్షసి వచ్చే వేళయింది." అంటు శివబంటునొక్కమూల నసెట్టింది.

కొంచెం సేపటిలో రాక్షసివచ్చింది. అది గుర్రుపెట్టి నిద్రపోవటం చూసి శివబంటుకు సంజ్ఞచేసిపిలిచింది. ఈరాక్షసునికోసం కనిపెట్టుకూర్చున్న శివబంటు నెమ్మదిగా వచ్చి వుంగరం రాయిమీద కొట్టాడు. రాయిపగిలిన తత్క్షణమంతే దాని కండ్లు పోయినై. గ్రుడ్డిదైలేచి గయ్యమంటూ అరవసాగింది, రాక్షసిని అటుఇటు త్రిప్పి నెమ్మదిగా చేతి వుంగరాన్ని లాక్కుని చితక్కొట్టాడు. రాక్షసికాస్త గుటుక్కుమంది. 'జైసీతారాం!' అని మిఠాయి పొట్లాన్ని చంకనెట్టుకొని బయలుదేరాడు.

(సశేషము)

---

# దైవమాయ

శ్రీ చామర్తి సుబ్రహ్మణ్యం

పూర్వకాలంలో అవంతీ నగరాన్ని జయవర్మయనురాజు పరిపాలిస్తుండేవాడు. అతడు ప్రజలను కన్నబిడ్డలవలె జూచుచు వారికేవిధమైన ఆపదలు సంభవించకుండా కాపాడుచుండెడివాడు. ప్రజలుకూడా జయవర్మయొక్క న్యాయపరిపాలనకు మెచ్చుకొని అతనికి వినయవిధేయతలతో మెలగుతుండే వారు.

జయవర్మకు సమస్త సౌఖ్యములు ఉన్నాయి. కాని అతనికి పుత్రులుకాని, పుత్రికలుకాని పుట్టలేదు. సంతానము నిమిత్తమై జయవర్మ తపస్సుచేయుటకు వింధ్యాటకి పోవుచు తనకుమిత్రుడునూ, మంత్రియునూ అగు జయసింహునకు రాజ్యభారము ఒప్పగించి వెళ్ళాడు.

వింధ్యాటవియందు ఒక నదీ తీరమున ఆశ్రమం నిర్మించుకున్నాడు. శంకరుని గూర్చి ఘోర తపస్సు ఆరభించారు. కొన్నాళ్లు, కందమూలములు భుజించి తపస్సుచేయసాగాడు. మరికొన్నాళ్ళు అన్నీ విసర్జించి వాయు భక్షణము చేయుచు తపస్సు చేయ సాగాడు. మరి మరికొన్నాళ్ళు వాయువును కూడావీడి ఆత్మను పరమాత్మయందుంచి తపస్సు చేయనారంభించాడు.

అతనితపోబలానికి మునీంద్రులు, ఇంద్రాదిదేవతలు భయపడి, చతుర్ముఖుయగు బ్రహ్మ దగ్గరకుపోయి సంగతంతా విన్నవించారు. అప్పుడు బ్రహ్మ వారితో అతని తపస్సును భంగపరచుట నా వల్ల కాదన్నారు. వెంటనే వారు శ్రీమన్నారాయణుని దగ్గరకు పోయారు. అతను కూడా నా వల్లకాదన్నాడు. వారు నిరాశతో పరమేశ్వరుని దగ్గరకుపోయి నీవు తప్ప మాకు దిక్కెవరూలేరు. అని దీన వదనంతో తాము వచ్చిన సంగతంతా చెప్పారు. అప్పుడు పరమేశ్వరుడు వారితో మీ కేమీయుభయము లేదు. అతఃకోరికనే నెఱుంగుదును. మీరు మీ మీస్థానములకు పోయి నిశ్చింతగానుండుడు అని చెప్పి వింధ్యాటవిలో ఘోరతపస్సు గావించుచున్న జయవర్మదగ్గర ప్రత్యక్షమయి

అతని భుజముమీద చేయివేసి తపోనిష్ట నుండి లేపాడు.

''ఓ రాజా! నేను శంకరుండను. నీతపస్సునకు సంతసించి నీకు ప్రత్యక్షమైనవాడను. ఏదియైనను వరము కోరుకొమ్మ''ని అడుగగా - జయవర్మ తపస్సునుండి లేచుసరికి ఎదురుగా సాక్షాత్ పరమశివుడు అగుపడుటచూచి అతని పాదములమీద మోకరిల్లి - ''ప్రభూ ఈ దినమున నిన్ను గాంచుటచే నా హృదయము పవిత్రమైనది. నాకోరిక నీకు తెలియకున్నాదా! అయితే నాకు సమస్తసద్గుణ శోభితుడైన పుత్రుని కాని పుత్రికనుకాని ప్రసాదించుమ''ని కోరాడు. అంత శివుడు నీకు పుత్రికజన్మించునని చెప్పి అంతర్ధానమయ్యాడు.

జయవర్మ రాజ్యమునకు తిరిగివచ్చాడు. ఆ సువార్తను రాణికినీ, రాజ్యప్రజలకు తెలియజేసాడు. రాజ్యప్రజలు ఆనందంతో ఉప్పొంగి పోయారు. అతని సేవకులు తమకు కానుకలు లభిస్తాయని ఆనంద పడ్డారు. కొన్ని నెలలకు రాణి గర్భవతియైనది. ఒక సుముహూర్తమున అందాల భరణిమగు ఒక పుత్రికను కన్నది. ఈవార్త రాజ్యమంతటా ప్రాకిపోయింది. ఆరోజున విందులతోనూ, వినోదాలతోనూ ఆ రాజ్యప్రజలు గడిపారు. పుట్టిన బాలికకు ''రూపవతి'', యని నామకరణంచేశారు.

ఆ బాలిక చిన్నతనంనుండిశివుని దీక్షతో పూజించసాగింది. ఒకానొక రాత్రి స్వప్నమందు ఆబాలికకు ఈశ్వరుడు అగుపడి ''ఓ కుమారీ! నీకు విష్ణుమూర్తియే భర్తకా గలడు. ఇతర రాజపుత్రులెవ్వరైనా నిన్ను పరిణయమాడుటకు వచ్చినేని వారు స్త్రీలుగా మారుదుర''ని చెప్పి మాయమయ్యాడు. ఉదయమున నే లేచి రాత్రికల లోని మాటలను ఎవరితోనూ చెప్పలేదు.

రూపవతికి పెండ్లీ ఈడు వచ్చింది. జయవర్మ స్వయంవరం ప్రకటించాడు. పలు దేశములనుండి రూపవతిని వివాహము ఆడగోరి పలువురు రాకుమారులు విచ్చేశారు. ఆ వచ్చిన రాకుమారులు జయవర్మ కూతురగు రూపవతిని చూడగనే వారు స్త్రీలుగా మారిపోయారు. ఈ దైవమాయకు అంతా భయపడసాగారు. ఈ విషయం అన్ని రాజ్యములకు తెలిసింది. ఇక రూపవతిని పరిణయమాడుటకు ఏ రాకుమారులు సాహసించలేకపోయారు.

ఒక నాడు ఆమె ఉద్యానవనంలో కూర్చొని విలపించుచుండగా, ఒకచిలుక మానవభాషలో ఈవిధముగ రాకుమారితో పల్కింది. ''ఓరాకుమారీ! ఎందుకు దుఃఖిస్తావు? నీకు తగినవరుడు మాయజమాని కలడు. అతడు సాక్షాత్ విష్ణుమూర్తియే. వానిని ఈ ప్రదేశమునకు తీసుకువచ్చెద''నని చెప్పి తనయజమానియగు 'కల్కి' దగ్గర వాలి అతనితో ''ఓకల్కీ! అవంతీదేశాన్ని జయవర్మ పాలిస్తున్నాడు. అతని కూతురగు రూపవతి నీకు తగిన భార్య. కనుక నాతో రా'' అని, వానిని,రూపవతి సమీపానికి తీసుకువచ్చింది. అచ్చట కల్కి రూపవతులు ఒకరి నొకరు గాఢంగా ప్రేమించుకున్నారు.

కాని అతను స్త్రీగా మారలేదు. ఈ వార్త రూపవతి తండ్రితో చెప్పింది. అపుడు వారిదువురికీ వైభవోపేతంగా వివాహం

చేశాడు. స్త్రీలుగామారిన రాకుమారులు కల్కిని చూచుటతోడనే వారి పూర్వపు రూపం వచ్చింది. వారు వారి రాజ్యాలకు పోయారు.

అప్పుడు జయవర్మ తన రాజ్యమును అల్లుడగు కల్కికి అప్పజెప్పి అడవికి పోయారు. కల్కిరూపవతులు ఆనందంగా కాలక్షేపం చేయసాగారు.

---

# శిబిచక్రవర్తి

## శ్రీ ఆకుండి వేంకటశాస్త్రి

దానవీరులలో శిబి, కర్ణుడు, దధీచి, ముందుగా పేర్కొనవలసినవారు. వీరిలో కర్ణుడు తన ప్రాణములకు సంబంధించినవని యెరిగియు, తనకు మాలిన ధర్మమునకు సిద్ధపడి, తనకు సహజసిద్ధములైన కవచకుండలములను దానమొనర్చినాడు. యోగాగ్నిలో తన శరీరము నాహుతియొనర్చి దధీచి దేవతాస్త్రముల నిమిత్తము తన వెన్నెముకను దానమొనర్చినాడు.

శరణాగత రక్షణము ఆర్యధర్మములలో నుత్తమమైనది. మన పురాణములందెల్లెడల, యిట్లు శరణాగతరక్షకుల చారిత్రములు గోచరించును. శత్రుని తమ్ముడైనను, విభీషణుని బ్రోచి శ్రీరాముడు 'విభీషణ శరణాగతి' యను బిరుదమును గాంచి లోకారాధ్యుడైనాడు.

తనకు చెలికాడై మేనమఱందియై సర్వదా ముఖ్యుడైన శ్రీకృష్ణునితో విరోధము సంభవించినను, వెలువక శరణాగతియైన గయుని రక్షించి, అర్జునుడు శాశ్వతమైన యశముగాంచినాడు తానున్న చెట్టు క్రిందకు వచ్చి తలదాచుకొన్న కిరాతకుని ప్రాణములు రక్షించుటకు పావురమగ్నిలోనురికి యాతని కాహారమైనది.

అట్లే శిబిచక్రవర్తి శరణాగత రక్షణమున పేరువడసెను. ఉశీనరదేశమున ఉశీనరుడను రాజీతనితండ్రి. తల్లి మాధవి. ఆనాటిరాజనుర్యాగననుసరించి శిబిచక్రవర్తి విజయయాత్రగావించి సప్తద్వీపములయందును దనకు శత్రువులులేకుండ నిరాటంకముగ బాలించెను.

పండు వెన్నెల బోలిన యాతని పాలనమున ప్రజలందఱు సుఖులైయుండిరన్న వింతకాదుగదా!

శిబిచక్రవర్తి గంగాతీరమున ననేకాశ్వమేధయాగములుగావించెను. ఈ నాటికిని కాశిలో శిబిచక్రవర్తి ఘట్టము అచటి ముఖ్యఘట్టములలో నొక్కటి. ఈ చక్రవర్తి యాగదీక్షను మెచ్చి శివుడీతని కనంతమైన ఐశ్వర్యములను, అక్షయమైన ధనములనొసంగెను.

శరణాగత రక్షణమున శిబిచక్రవర్తిపేరు ముల్లోకములమ్రోగి పోవుచుండెను: దేవతలు మెచ్చి అచ్చెరువందిరి.

ఒకనాడు శిబిచక్రవర్తి అశ్వమేధయాగదీక్షితుడై అగ్నిహోత్రగృహమున నుండెను. ఎక్కడనుండి వచ్చెనో ఒకపావురము ఱెక్కలల్లార్చుచు ప్రాణభీతిచే మిక్కిలి వేగముగా ఎగిరివచ్చి శిబిచక్రవర్తి ముందువ్రాలెను. దాని రెక్కలు చెదరి చెదరియుండెను. శరీరముపై గాయములనుండి రక్తముదోగుచుండెను. ఆ పావురము ఆయాసమున నోటమాటరాక శరణు, శరణు అనిమాత్రము పలికి నల్దిక్కులు చూచుచు చక్రవర్తి సమీపముననుండెను. శిబిచక్రవర్తి దానిని చూచి, ఓ పావురమా! నీకెంతమాత్రము భయము లేదు. ఈ కాశీరాజ్యమంతయు పోయినను, నీప్రాణము మాత్రము పోనీయను. తుదకు నాప్రాణమైనను పోవలయునుగాని నీకు మాత్రముభయములేదు, అని దానినోదార్చి నీకెవ్వరివలన నింతభయముగల్గెనో చెప్పుమనెను. ఇంతలో శరవేగమున నొక డేగపావురమును దఱుముచు నచ్చటికివచ్చెను. దానినిచూచి పావురము మరింతభయముతో వణకుచు శిబిచక్రవర్తి సమీపమునకు వచ్చి ఆయన అంకస్థలమున నొదిగియుండెను.

డేగయంతట మనుష్యభాషణమున నిట్లుపల్కెను— "ఓ శిబిచక్రవర్తీ! ఈ పావురము నేను తఱుముకొని వచ్చినాను. ఈ పావురము నా కాహారము,

"శ్యేనాః కపోతాన్ భక్షయంతి" అన్న శ్రుతివచనము నీ వెరుగనిది కాదు. పావురములు డేగలకు సహజసిద్ధమైన ఆహారము. నేను మూడు దినములనుండి ఆహారములేక యున్నాను. నా కన్నులు చీకట్లు క్రమ్ముచున్నవి. ఈ పావురమును తిననిచో నాకు వెంటనే ప్రాణత్యాగము తప్పదు. నాకు స్వతస్సిద్ధమైన ఆహారమును నాకు దక్కకుండ జేసి పాపముకట్టుకొనకుము. ఆపావురమును నాకు విడిచిపెట్టుము. అని ధర్మోపన్యాసముగావించి డేగ వేచియుండెను.

శిబిచక్రవర్తి కేమి చేయుటకును దోచలేదు. పావురమును డేగ కప్పగింపక దానిని రక్షింతునని వాగ్దానము చేసినాడు. డేగ ప్రాణము పోవుటతప్పదు. డేగను కాపాడుట కుద్యమించినచో పావురమును డేగ చంపుట కంగీకరింపవలయును. ముందు నూయియు, వెనుకగోయియు యున్నట్లున్నది.

"ఓ శ్యేనమా! నీవీ పావురమునువదలుము. నీయాకలి దీర్చుటకు నేను నీకేమికావలయునన్న నదియిచ్చెదను. బలసిన యెడ్లనుగాని, దున్నపోతులనుగాని శేళ్లనుగాని నీకుకావలసినన్ని తెచ్చియిచ్చెదను. వానిని దిని నీయాకలిని దీర్చుకొనుము. ఈ పావురము నన్ను శరణుజొచ్చినది. రాజధర్మమున ననుసరించి, నేనీ శరణు జొచ్చిన దిక్కుమాలిన, భయవిహ్వలమైన పక్షిని రక్షింపవలెనుగదా!" అనెను.

అంతట డేగ మనుష్యభాషలో నిట్లనెను:- "ఓ శిబిచక్రవర్తీ! ఏమో నేనెరుగని రాజధర్మమును చెప్పుచున్నావు. ఈ మానవప్రపంచమున నీవు రాజువుగాని ఖేచరములను రక్షింపవలసిన బాధ్యత నీకులేదు. ఒకవేళ ఖేచరములనుగూడ రక్షింపవలయునందువేని, నాకాహారమైన దీనిని యెంతదూరమునుండియో, నేను తరముకొనివచ్చుచున్నాను. దీనిని నాకిచ్చి నాయాకలిని తీర్చి నన్నుకూడ రక్షింపవలయును గదా! నీకాపావురమును రక్షించుటకంత పట్టుదలయేకలదేని యీ పావురమంత బరువుగల నీ శరీరమందలి మాంసమును కండలు కండలుగాకోసి నాకాహారముగా నిమ్ము. నేనామాంసమును దిని నాయాకలి దీర్చుకొందును." అనెను.

అంత శిబిచక్రవర్తి యొంతమాత్రము వెనుదీయక, జంకు గొంకులు లేకుండ, తన శరీరమునుండి మాంసమును కండలు కండలుగా గోసి యిచ్చుటకు సిద్ధపడెను. తత్క్షణమే ఒక తక్కెడ తెప్పించెను. అందొక పళ్లెములో ఆ పావురమును ఉంచెను. రెండవపళ్లెములో తనతొడలోని మాంసమును గోసి పడవైచెను. రక్తప్రవాహములు కారుచుండెను. పావురమున్న తక్కెడ పళ్లెమువైపే చాలబరువై క్రుంగియుండెను. తనచేతులనుండి కండలు గోసి రెండవపళ్లెములో పడవేయుచుండెను. పావురమింకను బరువుగానుండెను. క్రమముగా ఆతడు తన శరీరమున అనేకచోట్ల కండలు కోసి రెండవపళ్లెములో పడవేయుచున్నను యింకను పావురమున్న త్రాసు-పళ్లెమువైపే చాల బరువుగా నుండెను. క్రమముగా తన శరీరములోని మాంసమంతయును కోసి రెండవ పళ్లెములో వేసినను పావురము బరువునకు సరిగతూగలేదు. ఇక అతని అస్థిపంజరము మాత్రము మిగిలెను. అంతట శిబిచక్రవర్తి తానే త్రాసు రెండవపళ్లెములో కూర్చుండెను. అయినను పావురమున్నవైపు పళ్లెమే క్రుంగుచుండెను.

అంతలో శిబి చక్రవర్తి యెదుట ఇంద్రుడును, అగ్నిదేవుడు ప్రత్యక్షమైరి. పావురము, డేగయు అదృశ్యమయ్యెను. వారిద్దరు శిబి చక్రవర్తితో "ఓ శిబిచక్రవర్తీ! మేము ఇంద్రాగ్నులము. నీశరణాగత రక్షణదీక్షను పరీక్షింపదలచి మేమీపావురము, డేగ రూపములతో యిటకు వచ్చితిమి. నీవు యీమా 'అగ్ని పరీక్ష'కు గురియై, అందు జయమందగల్గితివి. నీ శరణాగత రక్షణము ముల్లోకముల ప్రశస్తి పడయును గాక! నీ శరీరము యథాపూర్వము కనగును గాక! అనుచు ఇంద్రాగ్నులు అంతర్ధానమైరి.

శరణాగత రక్షణమునందు శిబిచక్రవర్తి అగ్రగణ్యుడు.

['ఆకాశవాణి' (ఆలిండియా రేడియో) విజయవాడ కేంద్రమువారి అనుమతితో]

—(౦)—

# జ్యోతిష్కుడు — కమ్మరి

ఒక జ్యోతిష్కుడికి నదిని దాటాల్సి వచ్చింది.

నదేమో బాగా వెడల్పుగాలోతుగా వుంది.

అందుచేత కమ్మరిని నదిని దాటిస్తావా అని అడిగాడు.

అతను సరేనన్నాడు. ఇద్దరూ దోనెలో కెక్కారు.

జ్యోతిష్కుడు కమ్మరిని అడిగాడు -

'నక్షత్రాల్ని గూర్చి నువ్వేమైనా తెలుసుకున్నావా?' అని

'అబ్బే, నాకవేం తెలీదు బాబూ' అన్నాడు కమ్మరి.

'ఐతే నీ జీవితంలో మూడోవంతు కాలం వ్యర్థం. మరి చరిత్ర జ్ఞానంయేమన్నా వుందా?'

'అబ్బే! అల్లాంటిదేం లేదుబాబూ!'

'సరి! ఐతేనీ జీవితం సగమంతా వ్యర్థమే! పోనీ లెక్కలేమన్నా వచ్చా?'

'బాబూ లెక్కలన్నాతిన్నగా రావండి!'

'అరె! నీజీవితం మూడువంతులూ కూడా వ్యర్థమైపోయిందిరా.'

ఆవిధంగా వారు నదిమధ్యకు చేరుకునే సరికి ఒకపెద్దకెరటం మొచ్చిఢీకొని పడవ కాస్తా తలక్రిందులయింది,

కమ్మరి కేకేసాడు 'జ్యోతిష్కుడుగారూ మీకీదడ మొచ్చా?' అని.

'రాదు' అని వచ్చింది సమాధానం.

'బాబో - అయితే తమరి జీవితవంతా వ్యర్థమయేలాగుంది, నాబుజాల్ని వాటేసుకోండి - దాటేస్తాను' అన్నాడు కమ్మరి.

# మన నాటకం
## [పంచ వర్ష ప్రణాళికలు]

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

(డిశంబరు సంచిక తరువాయి)

## ఐదవ రంగం

[ప్రదేశము :_ రామవరం అను గ్రామమండలి సభామంటపము.
ప్రవేశము :_ ప్రభుత్వ గ్రామ సేవకుడగు భాస్కరయ్య, గ్రామీణులు]

భాస్కరయ్య:-
(ప్రార్థన చేయును)

— పాట —

ఈశ్వర అల్లా ఏసు స్వరూపా !
శాశ్వత కారణ ! జగదుద్ధారణ !
నమో ! నమో !

శాంతియు, సహన, సమత్వ మహింసయు
సత్య సుగుణ మిడుమా !
॥ఈశ్వర॥

సహజ సంపదలు శరీర బలమును
సద్వినియోగము సలిపి - జీవన
ప్రమాణ మధికము జేయ బ్రోవవే !
॥ఈశ్వర॥

నిరుద్యోగ నిర్మూల మొనర్చి,
నిమ్న జాతి సముద్ధరించుచు,
విద్యారోగ్యము, సంఘసేవ, వ్యవసాయ
సంపదలు,
విద్యుత్, జలమును, విపిన సంపదలు,
పశు సంక్షేమము, పరిశ్రమలు -
బహుళ వ్యాప్త మొనరించుట కొరకై
కాపాడవె మము, కారుణ్య నిధీ !
॥ఈశ్వర॥

మా గ్రామము రామవరము నేటినుండి జాతీయ విస్తరణ సేవా కేంద్ర ప్రదేశము నందు చేరినది. ఈ గ్రామాభివృద్ధికి మనము తగిన కృషి సలుపవలసి యున్నది.

బంగార:_ అందులకు అందరము సంసిద్ధులమై యున్నాము.

భాస్కర:_ ఈ రామవరము అభివృద్ధి పొందుట కేమేమి ఏర్పాటులు చేయవలెనో ముందుగా చర్చింతము.

మాధవ:_ ఆరోగ్య పారిశుద్ధ్య విషయములను ముందుగా చర్చింపవలసి యున్నవి.

భాస్కరం:_ ఈ గ్రామమందు దుర్మరణము లున్నావా ?

రాఘవ:_ లేకేమి ? అప్పుడప్పుడు కలుగు తుంటాయి ! మాకు వైద్యసౌకర్యాలు కావాలి !

భాస్కర:_ (వ్రాసికొని) మంచినీటి వసతు లేమిగలవు?

బంగార:_ ఒక చెఱువు, ఒక బావి గలవు. ఇంకొక బావి కావలెను.

భాస్కర:_ నీటిని పరిశుభ్రముగా నుంచుకొనవలెను. వీధులు, ఇండ్లు, పరిసరములు ఎప్పటి కప్పుడు పరిశుభ్రమిగా నుంచుకొను చుండవలెను. గ్రామము నుండి మురికి నీటి కాలవలకు పంపుటకు అందరూ కలిసి పనిచేయవలెను.

రాఘవ:_ అట్లే చేసెదము.

భాస్కర:_ మురుగు దొడ్లున్నవా ?

రాఘవ:_ లేవు.

భాస్కర:- వీధు లెన్నిగలవు ?

రాఘవ:- నాలుగున్నవి

భాస్కర:— స్త్రీలకు నాలుగు, పురుషులకు నాలుగు మరుగు దొడ్లు చాలునా?

మాధవ:—చాలును.

భాస్కర:—(వ్రాసికొని) విద్యా సౌకర్యము లెట్లున్నవి?

మాధవ:—ప్రాథమిక బడి గలదు.

భాస్కర:—మన బడుల యందు గ్రామ జీవితమున కనువుగా విద్యా సౌకర్యము లుండవలెను. కనుక మన దేశమందు బేసిక్ విద్య ప్రారంభింపబడినది. మీ పాఠశాల బేసిక్ పాఠశాలగా మార్చబడవలెను.

మాధవ:—మార్చబడియే యున్నది.

భాస్కర:—(వ్రాసికొని) 6 మొదలు 14 ఏండ్ల బడి యీడు పిల్లలను బడికి క్రమముగా పంపుచున్నారా?

బంగార:—అందరు పిల్లలూ వెళ్లలేదు. కొందరు మాత్రము వెళ్లుచున్నారు.

భాస్కర:—అట్లుచేయరాదు. అందరు పిల్లలను బడికి పంపవలెను.

గోవింద:—అయ్యవార్లు ప్రతిదినం బడిపిల్లలకు పిలువరండీ!

భాస్కర:—అది వారి పనికాదు. — అయ్యలారా! మీ పిల్లలకు చదువు వస్తే మీకే లాభము. మీరు పిల్లలను బడిగంట మ్రోగునప్పటికి పంపవలసి యున్నది. మీ పిల్లల బాధ్యత మీకే కలుగనప్పుడు ఎట్లుండునో మీరే యోచించవలెను. ఉపాధ్యాయుడు యింటింటా పోయి పిల్లలను పిలిచి బడికి తీసుకపోవుటకు అనవసరముగా కాలము వెచ్చించుట మంచి పద్ధతి కాదు. ఇది మనకే నష్టము. విద్య యొక్క విశిష్టత మీకు తెలియదు.

మాధవ:—మా గ్రామములో చాలా ఎక్కువ సంఖ్య నిరక్షరాస్యులుగా నున్నారు.

భాస్కర:—అయ్యో! అది చాలా అసంభవము, స్త్రీ పురుషులు, బాల బాలికలు అను భేదము గాని, జాతిమత భేదములుగాని పాటింపకుండా అందరూ చదువుకొనవలెను.

బంగార:—మా గ్రామమునకు పెద్దల పాఠశాల కావలెను.

భాస్కర:—(వ్రాసికొనును)

రాఘవ:—పెద్దలు చదువుకొనుటకు వసతి లేదే?

భాస్కర:—పిల్లల పాఠశాల వున్నదికదా! దానినే పిల్లల బడివేళ పిమ్మట వినియోగించవచ్చును. ఆ మందిరమునే అనేక కార్యములకు వినియోగించవచ్చును.

రాఘవ:—ఇందువలన పిల్లల చదువునకు ఆటంకములు కలుగునేమో?

భాస్కర:—అట్లయిన వేరొక సాముదాయిక మందిరము (Community Hall) నియమించి పుస్తక భాండాగారము గాను, అచ్చటనే రేడియో వినుట, గ్రామ సంఘాలు సమావేశమగుట, వినోద విజ్ఞాన కార్యములు సలుపుట మొదలగు సాముదాయిక కార్యములకు వినియోగింప వచ్చును.

బంగార:—అట్లయిన సాముదాయిక గ్రామ మందిర మొకటి మాకు గావలెను.

భాస్కర:—(వ్రాసికొని) మీ గ్రామములో భూము లన్నియు సాగుచేయబడుచున్నవా?

బంగార:—కొంచెము భాగము బీటు భూములు పశువుల కొరకు విడిచిపెట్టబడినవి మిగిలినవి సాగులో నున్నవి.

బంగార: పల్లపు భూముల లోను, మెట్టభూముల లోను అవసరమైన పంటలే పండింపబడుచున్నవి.

భాస్కర:—సరాసరి పంటలెట్లు ఫలించును?

బంగార:—మామూలే!

భాస్కర—ఎక్కువగా పండించే పంట యేమి?

బంగార:—వరి పంట,

భాస్కర:—క్రొత్త పద్ధతులవ వలంబింప బడినవా?

బంగార.—లేదు.

భాస్కర:—క్రొత్త పద్ధతుల వలన చాల లాభము కలదు. తక్కువ కష్టములో, తక్కువ వ్యయముతో ఎక్కువ పంటను పండించవచ్చును. కనుక మీరు జపాను పద్ధతిలో సాగుచేయుట మంచిది. క్రొత్తరకపు విత్తనములు, కల్తీలేని విత్తనములు ఉపయోగించవలెను. పచ్చి రొట్టపైరులు, పెంట

ఎరువు, కృత్రిమపు టెరువులు వాడి పైరు నేలనుండి తీసుకొనిన యాహారములను తిరిగి భర్తీ చేయుచుండినట్లయిన మంచి పంటలు పండుచుండును. ఊరిబైట గోతులు త్రవ్వి అందు గ్రామములోని చెత్తచెదారములు వేయవచ్చును. ఇందువలన గ్రామ పారిశుద్ధ్యము బాగుండుటయే గాక, మంచి యెరువును తయారు చేసుకొనవచ్చును.

బంగార:- వ్యవసాయ దారులకు కావలసిన మంచి సలహాలనే యిచ్చుచున్నారు.

భాస్కర:- ధాన్యము మిక్కిలి రుద్దు కాకుండా కోయుట, నూర్చుట, సరిగా నిల్వచేయుట మొదలగువానియందు జాగ్రత వహించవలెను. ధాన్యాదులకు చీడలు పట్టకుండా చూడవలెను. నీరు ఎక్కువ రుద్దు కాకుండా పారుదల ఏర్పాటులు చేయవలెను. ఇట్టి నూతన విధానముల యొక్క లాభములు మీకు ప్రత్యక్షముగా చూపగలము. అందుకు మీ సహాయము కావలెను.

బంగార: అయిన మాసహాయ మేమికావలెను ?

భాస్కర:- కొందరు రైతులు మాదిరిగా కొన్ని సెంట్ల భూమిని ప్రత్యేకించి యీ క్రొత్త సాగును చేసినట్లయిన వాటి విధానాలు నేను చెప్పదగును.

బంగారి:- అట్లే శ్రద్ధ తీసుకొందుము.

రాఘవ:- గ్రామరస్తాల గురించి చాలఏర్పాటులు చేయవలసియున్నవి.

భాస్కర:- అవి ఏమి ?

రాఘవ:- గ్రామమునుండి మెయిన్ రోడ్డువరకు పిల్ల రోడ్డు కావలెను. వీధులలోని రోడ్లుమరమ్మతులు కావలెను.

భాస్కర:(వ్రాసికొని) తపాలాఫీసు కావలెనా ?

మాధవ:- కావలెను. — ఇంక శ్రీ జనాభ్యుదయమునకు కావలసిన అన్ని యేర్పాటులు జరుగవలెను.

భాస్కర:- అట్లే, — (వ్రాసికొని) గ్రామీణులకు సంవత్సరము పొడుగున పనియుండదు. సుమారు 150 మొదలు 270 రోజులవరకే పని యుండవచ్చును.

రాఘవ:- మిగిలిన కాలము వ్యర్థమే చేయుచున్నాము.

భాస్కర:- ఆ కాలములో మీరు గ్రామ పరిశ్రమలు చేయవలెను. పాలు అమ్ముట, కోళ్లను పెంచుట నూలు వడకుట, త్రాళ్లు పేనుట, పండ్లను పండించుట, బెల్లముచేయుట, చాపలల్లుట, నిత్యావసర వస్తువులు చేయుట మొదలగు ఎన్నో పనులు చేసి ఆదాయము పెంచవచ్చును. కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, సాలె, మాదిగ మొదలగు వృత్తి పనివాండ్రు తమతమ వృత్తులను అభివృద్ధి చేసుకొనవచ్చును.

రాఘవ:- సరే, మా గ్రామాభివృద్ధికి ఎన్ని కార్యములైనా ప్రవేశపెట్టవచ్చును. వీటికి తగిన సహాయమెట్లుగలుగునండీ!

భాస్కర:- "ఐకమత్యమే బలము" అను సామెత మీకు తెలిసినదే ! — మీరందరు శ్రద్ధాసక్తులను కలిగి గ్రామసమస్యలు, కార్య కలాపములు గురించి తెలుసుకొనవలెను. అందరూ సాముదాయక కార్యములలో పాల్గొనవలెను. ఆయా కార్యములుచేయుటకు మీలో కొన్నిసంఘముల నేర్పరచుకొనవలెను. పంచాయతీ సంఘము, పరపతి సహకార సంఘము, వ్యవసాయ సంఘము విద్యా సంఘము, పరిశ్రమల సంఘము మొదలైన కొన్ని రకముల సంఘములు ఏర్పరచవలెను. వీటిద్వారా ప్రభుత్వము సహాయము చేయును.

రాఘవ:- ఆ సహాము మెట్టిదో వివరిస్తారా ?

భాస్కర:- సరే, వినండి !

సకల గ్రామాలలో । సహకార సంఘాలు
విరివిగా నిడి యభి। వృద్ధి గాంచ,
స్వల్ప కాలికములు,। సామాన్య కాలిక,
దీర్ఘ కాల ఋణాలు । దీర్ప నిచ్చు;
క్రయ విక్రయంపు సా। కర్యాలు కలిగించి
వస్తువుల్ నిల్వకు । వసతు లొసగి ;
సంఘాలు విజయమ్ము ! సాధింప గలిగెడి
శిక్షణ మీయగా । సిద్ధ పడుచు,

వలయు, పరపతితో సర్వ । ప్రజలు, పెక్కు-
కార్యములు సల్పిలాభాలు । గాంచు చుండి;
కూడు, గుడ్డకు, వసతికి । కొదువ లేని
బ్రతుకుబొందంగ గన ప్రభు।త్వమ్ము తలచె,

రాఘవ:—ప్రభుత్వం తమ ప్రజలను, తాము కాపాడ కుంటే యింకెవరు కాపాడుదురు ?

భాస్కర:—మరియు, మీ గ్రామాభివృద్ధికి మీరు ధన సహాయముగాని, వస్తుసహాయముగాని, శ్రమ రూపేణా సహాయముగాని చేసే పక్షమున ప్రభుత్వము ఆయా కార్యములకు నిర్ణయించుకొన్న ప్రకారం రెండు, మూడు రెట్లు ధన సహాయము చేసి, కావలసిన సలహాల నిచ్చి మీగ్రామము సర్వతోముఖాభివృద్ధి పొందుటకు ప్రోత్సాహ మిచ్చును.

బంగార:—మా గ్రామకల్యాణమునకు మేము నడుము బిగించి పనిచేయగలము.

[అందరు చప్పట్లు కొట్టుదురు]

భాస్కర:—మన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తి యగు నప్పటికి ఎంతో అభివృద్ధి పొందవలసి యున్నది. ఇందుకొరకు ఎంతైనా ఉన్నది

మననాటకం.

— 'పాట' —

జన గణ మన అధి నాయక జయహే
భారత భాగ్య విధాతా!
పంజాబ సింధు గుజరాత మరాటా
ద్రావిడ ఉత్కళ వంగా
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగా
తవశుభ నామ జాగే తవశుభ ఆశిషమాగే
గాహే తవ జయ గాథా!
జన గణ మంగళ దాయక జయహే
భారత భాగ్య విధాతా!
జయహే! జయహే! జయహే!
జయజయజయ జయ — జయహే!

[తెర వ్రాలును]

సమాప్తము

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గతసంచిక తరువాయి)

౯

కల్పవృక్ష ప్రదేశమ్ము గల్గు; నచట
కనక మంటప మొక్కటిదనరు; నచట
అష్టదళ పద్మ శోభితమైన — పుష్ప
కమున, గ్రేష్ఠపీఠంబున కమలనయన!
అధివసించి నాఁడవు; హృదయారవింద
మునకు,' జ్ఞానముద్రను దాల్చు ముద్దు
కరము
డాకుచుండ, వీరాసనస్థానమొర్మిఁ
దాల్చినాడవు; శ్రీరామ! దాశరథుఁడ!
నెమ్మినిను నమ్మినాశ - భావమ్మునందు
చిత్తసంస్కారమొసఁగు మా శ్రీ రమేశ!

౧౦

మించు, బల్మిఁబయోధి బంధించినావు
వినుత సంక్రందనుండయి - వెలసినావు
యోగ్యులకు, గొప్పధనమీవు - యోగి
వంద్య!
సకల కామనిష్యందన చక్రవర్తి
వీవు! లోక తాపము, హరియించినావు;
సత్య సంకల్ప! చందన చర్చితాంగ!
పవన నందనస్యందన! పరమపురుష!
రాఘవా! జానకీనాథ! రమ్యహృదయ!
నిన్ను భజియింతు సతతంబు నియతితోడ
కష్టములబాపి రక్షింపు కరుణతోడ

౧౧

ఇందీవరశ్యామ! ఇభరాజ వరద! శో
ణ, సరోజనేత్రా! శ్రీ నాథ! రామ!
మేటిబల్మిని, ధనుఃకోటినిఁ జేఁదాల్చి
కవచ, జటాదులఁగల్గి; వీర
తేజముప్పొంగ వధించిన వాఁడవు
ఖరదూషణాది, రాక్షసులనెల్ల
తూణీరయుగధారి! దోర్బలశక్తి, నీ
కెవ్వరుందురు సాటియీధరిత్ర?
ఉడుము దోలు వ్రేళ్లతొడుగుల ధరియించి
వింటి నారి నీడ్చి - పెక్కుబాణ
తతుల విడిచి, శత్రుతతి సంహరించిన
రామచంద్ర! కొనుము ప్రణతిశతము,

౧౨

మందార వృక్షముల్ - మహనీయమై
యుండు.
పుష్పకమనునొక్క పొలుపుమీఱు
మండప మాచోటనుండు; దాని నడుమ
యష్టపత్రంబుల - నమరినట్టి
సూర్యబింబద్యుతి శోభిల్లు పద్మంబు
చెలువారు; నందు శ్రీ సీతతోడ
వెలయుచున్నావు - వీరాంజనేయ; ల
క్ష్మణుఁడు, సుగ్రీవులు - మమతనిన్నుఁ
గొల్చుచున్నారు; శ్రీరామ! కువలయేశ!
రఘుపతీ! జానకీ నాథ! రామభద్ర!
నిత్యతాపత్రయముల, ఖండించి, చిత్త
శాంతి నొసఁగి, రక్షింపు - వేదాంతవేద్య!

౧౩

నీలమేఘశ్యామ! నిర్మల చంద్ర బిం
బాస్య! శ్రీ లోల! పద్మాక్ష! వరద!

మాణిక్య కుండల - మకుటాభిరామ! రా
వణ మర్దనా! విభీషణ, విచార
పరిహారకా! ధనుర్బాణ సంయుక్త! సీ
తాసమేత! ముకుంద! తాపసాళి
చిత్తాబ్జములఁదోచు శ్రీనాథ! రఘువరా!
నాగేంద్ర శయన! వినాశ దురిత
జాలమేల?
జాల! శ్రీ రామ! జయరామ! జాలమేల?
చిన్మయానంద! గోవింద! శ్రీనివాస!
భక్త రక్షణ నీ పరిపాటిగాదె?
అభయ మిచ్చి రక్షింపుము-హరి!
ముకుంద!

౧౪

రాజీవనేత్రుండు - రఘువంశముఖ్యుండు
వామాంకమున; సీతఁబరగు వాఁడు
వర ధనుర్బాణ సంబరములు గలవాఁడు
శాంతుండు, మందహాసంబువాఁడు
కుండలశోభిర - గండస్థలము వాఁడు
నీల దేహంబుతో - నెగడు వాఁడు
శత సూర్యకాంతుల స్వచ్ఛ దేహమువాఁడు
మణి కిరీటమువాడు - మాధవుండు
వజ్రసింహాసనమునందు వరలువాఁడు
రాజ రాజుల కధి పతి - రామచంద్ర
మూర్తి నా దేవు సతతంబు ముదముతోడ
స్తోత్ర మొనరించెదను; పరిశుద్ధుఁడగుచు

౧౫

కుడిచేతనుపదేశ ముడిముద్ర ధరియించి
మానుల దీవించు మాన్యుఁడీవు
మెమ మోకాలిపై - నిడినహస్తముగలి
శ్రీ రామ! గుణధామ! శ్రీశుభాంగ!
భూషణ వితతులఁబొలుపారుచున్నట్టి
స్తన భార వశ్యలేఁడమువు వంగి
యున్నట్టి వై దేహి - నుజ్వలదేహి, నా
సక్తిఁగాంచుచునున్న రక్తుఁడీవు
రామ! నీలమేఘశ్యామ! సోమసూర్య
బింబముల, నేత్రములుగాఁగ వెలయుదీవు!
భక్తపరిరక్షణము - పరిపాటి నీకు
అభయమిచ్చి, రక్షింపుము హరి! ముకుంద!

౧౬

విబుధుల భరియించు విమల చిత్తము గల్గి
పుష్పోపహారంబు బొందినావు
జానకీ లక్ష్మణ - సహితుండవై, వాయు-
వేగ బాణంబుల, జాగులేక
నందించు తూణీర ఖండంబుగాఁగల్గి
దుష్టుల శిక్షించి, దురితనాశ
నంబొనరించు, పుణ్యస్వరూప! కమల
నేత్ర! శ్రీరామ! తాపత్రయంబు
లడఁగఁజేయుము; సంసారమందుమునిగి
సారహీన సుఖంబుల, సారమంచు
జింగి, దిక్కుఁదెలియు; ఁగీలెఱుంగఁదెల్పి
సత్పథంబున నడపుము, జలజనయన!

౧౭

రామ! నీత త్త్వ మార్గంబు రక్తి నాంజ
నేయుఁడెఱుఁగు సుగ్రీవుండు నెయ్యవెఱుఁగు
యుద్ధమార్గంబు రావణుఁడొకఁడెయెఱుఁగు
సత్య మార్గంబు శ్రీవిభీషణుఁడెఱుంగు.

౧౮

శ్రీరామ! రఘుపతీ! చిన్మయాకార!
కారుణ్యసింధు; సంకట పరిహార!
జగదేక వీర! యోజానకీరమణ!
జగదేక బంధు; సుచారిత్ర సుగుణ!
శ్రీరామ! అభిరామ! శ్రీనాథ! వరద!
ప్రారబ్ధ కర్ముండ! పరమదీనుండ!
రక్షింపు కృపణుండ! రహిఁగృతఘ్నుండ!
పక్షివాహన! నిన్నుఁ బ్రార్థింతు సతము
(సశేషము)

# అల్లకల్లోలం

శ్రీ వై. శ్రీనివాస్

డిగ్రీ పరీక్షలు ప్రారంభం కావటానికి యింక మూడు వారాలయినాలేవు. రామానుజం శాస్త్రిలు అహోరాత్రాలు అదేపనిగా చదివేస్తున్నాడు. విజ్ఞానం కోసం అన్నయ్య పడే శ్రమ చూడలేక శ్రీయూనివర్సిటీ ఫస్టయిన తమ్ముడు రఘు, అన్నయ్యవంక ఓరగంట చూచాడు. ముఖానికి అడ్డంగా పుస్తకము — పుస్తకము అవతలి వేపునుండి తొంగి చూసే ముచ్చటైన మూడుముళ్లపిలక. ఇదే రఘుకు కనుపించిన దృశ్యం. రఘుకు సహనం నశించింది.

"ఏమిటన్నయ్యా! పరీక్షలు రావడానికి యింక మూడు వారాలయినాలేవు! నీవు డిటెక్టివ్ నవలలు చదవటమేమిటి?" అన్నాడు రఘు.

"ఇశ్! మాట్లాడకు! కథ మాంచి క్లైమాక్సులో వుంది." అని గట్టిగా కళ్లుమూసి తెరిచాడు రామానుజం శాస్త్రిలు.

శాస్త్రిలు నేటి నవీనయుగంలోకూడా పిలక కత్తిరించని సనాతనాచారపరుడు. పింజ పోసిన ధోవతి విడవని నిష్ఠాపరుడు. ఇన్ని సద్గుణాలువున్నా, డిటెక్టివ్ నవలలలోని పుల్లిపూరలాంటి చీరలో, వెల్వేటు బ్లౌజులో, రవ్వల గాజులతో, హైహీల్డు బూట్లతో దేదీప్యమానంగా మెరసిపోతున్న అతిలోక సుందరి కావాలి తనకు. షెర్లాక్సు హోమ్సు అంతటి వాడయిన వాలి అడుగుజాడల్లో అపరాధ పరిశోధనలు చేయాలి తను. యుగంధర్ వంటి గుండె ధైర్యస్థుడు కావాలి మరి తను. అశ్వద్ధామ కున్నటు వంటి ఏర్ కండిషన్డ్ గది కావాలి తనకు. హిల్మన్ కారు కావాలి. అది వుంచుకోవడానికి, అవసరమయినపుడు బయటకు తీసి తూనీగలా దూసుకు పోవడానికి కావాలి తనకు గారేజి. ఇవన్నీ శాస్త్రిల వారి మూడు ముళ్ల ముచ్చటైన పిలకక్రింద వున్న అమోఘమైన మేధస్సుక్రింద దాగొని దోబూచులాడు తున్న కోర్కెల కెరటాలు.

అప్పుడు రాత్రి 11 గంటలయింది. మాటుమణిగింది చిన్నపట్టణంలాంటి పల్లెటూరు. డాబామీది రూములో శాస్త్రిలు చదివేస్తున్నాడు. డిటెక్టివ్ నవలలోని క్లైమాక్సు. హంతకుడు అంతు చిక్కలేదు. డిటెక్టివ్‌లు పడరాని అవస్థలూ పడుతున్నారు. డిటెక్టివ్‌నే పోలీసులు అరెస్టు చెసేటట్లు వున్నారు. రామానుజంశాస్త్రిలకి క్లైమాక్సు కపాళం అంటింది. లేచికూర్చుని చూశాడు — అట్టమీది త్రివర్ణ ముఖచిత్రం - దాని ప్రక్కన రక్తస్నిగ్ధమైన కత్తి - రామానుజం గుండెలు దడదడలాడాయి. ఎందుకో? పేజీలు త్రిప్పాడు. చదివాడు. హంతకుడు హత్యాప్రయత్నం చేస్తున్నాడు. నవలలోని ఆ సమయం సరిగ్గా 11 గంటల 10 నిముషాలు. శాస్త్రిలు తనవాచీకేసి చూచుకున్నాడు. సరిగ్గా 11 గంటల 10 నిముషాలు. ఎర్రముల్లు అతివేగంగా తిరుగుతోంది. రూమంతా కలయ జూశాడు. తలుపులుబార్లా తీసివున్నాయి. కిటికీలకు కట్టిన తెరలు గాలికి రెపరెపలాడుతున్నాయి. గోడగడియారం టిక్ టిక్ మంటోంది. అదికూడా సరిగ్గా 11 గంటల 10 నిముషాలే చూపిస్తోంది. శాస్త్రిల గుండెలో రైళ్లు పరుగెత్తున్నాయి. రూమంతా ప్రశాంతంగా, నిశ్శబ్దంగా వుంది. ఎక్కడా ఏ అలికిడీ లేదు. శాస్త్రిలు పుస్తకం మూసేశాడు. దుప్పటి కాళ్లనుండి తలవరకు కప్పుకొని కాస్తసందు చేసుకుని రూము తా కలయజూస్తున్నాడు. తను ఎందుకో భయపడ్తున్నాడు. ఎందుకో? తనకు వయస్సు పంధొమ్మిది. తనేమిటి? భయపడటమేమిటి? కారణం! టైము 11 గంటలు 12 నిముషాలు. అయినా భయం వదలలేదు. నవలలో 11-10 — 11 _ 15 ల మధ్య హత్య జరిగిపోయింది. శాస్త్రిలు గట్టిగా కళ్లుమూసుకున్నాడు. కొంత దూరంలో యింటి పెంకులమీద మానవాకారం నడుస్తున్న చప్పుడు వినవస్తోంది. శాస్త్రిలు గట్టిగా వూపిరి బిగపట్టాడు. గభీమని దూకినచప్పుడు. కళ్లు తెరిచాడు. రూములో లైటు ఆరిపోయింది. కన్ను

పొడుచుకున్నా కనుపించనికటిక చీకటి. శాస్త్రిల గుండెదడ హెచ్చిపోయింది. వూపిరి సలపటంలేదు. చెమటలు కారిపోతున్నాయి. శ్రీ ఆంజనేయులవారి దండకం పదిమార్లు జపించాడు. గుండెలరచేత బిగపట్టుకుని మెల్లగా బ్రహ్మ ప్రయత్నంమీద మంచం దిగాడు. లైటు స్విచ్ మీద చేయివేశాడు. తన చేయిమీద మరోచేయి పడలేదు కానీ గభాలున చేయి తీసివేశాడు. మరలా స్విచ్ నొక్కాడు. స్విచ్ వేసేవుంది. రెండు మూడుమార్లు పైకి క్రిందికి స్విచ్‌ని నొక్కాడు. లైటు వెలగలేదు. కారణం? అసలు హంతకుడు లేక దొంగ బల్బునే తీసివేసి వుంటాడనకున్నాడు శాస్త్రిలు.

పెద్ద శబ్దంతో ఏదో క్రిందబడి విరిగిపోయింది. శాస్త్రిలు గభాలున కూర్చున్నాడు. అలాగే మంచం క్రిందికి చప్పుడు కాకుండా చేరకున్నాడు. కాలికి చల్లటి ద్రవపధార్ధమేదో తగిలింది. శాస్త్రిలు చప్పున కాలులాక్కున్నాడు. కొంతసేపటికి ఆ ద్రవపధార్థాన్ని చేతితో తాకి చూశాడు. ఆద్రవ పధార్థాం చల్లటినీరు.

శాస్త్రిలు తమ్ముడు రఘుని కేకేద్దామనుకున్నాడు. కానీ అలా శబ్దంచేస్తే హంతకుడికి తనవునికి తెలిసి పోతుందేమోనని వూరుకుని మెల్లగా తమ్ముడిమంచం చేరుకున్నాడు. అది చాలా విశాలమయిన గది కావడంమూలాన, శాస్త్రిలకి తమ్ముడిమంచం చేరుకునేసరికి 15 సెకండ్లు పట్టింది. మంచం, మీద చేతితో తడివి చూశాడు. మంచం మీద నిలువు గాదిండు. ఆ దిండుపైన దుప్పటి.

తమ్ముడు ఏమయ్యాడు? తన మంచంక్రిందికి నీళ్లెలావచ్చాయి? క్రిందపడి పగిలిపోయిన వస్తువేది? లైటు ఎలా ఆరిపోయింది? ఇలా జరగడానికి గల కారణాలేమిటి? ఇవి శాస్త్రిలవారి పరిష్కారంకాని సమస్యలు. బుర్ర సుడిగాలిలా గిర్రునతిరుగుతుంది. ఒక్కసారి కళ్లుమూసుకుని తనుచదివిన డిటెక్టివ్ నవలలన్నీ నెమరు వేసుకున్నాడు. పరిశోధనకు పూనుకోవాలనుకున్నాడు. కానీ ఎలా? పాలుపోలేదు శాస్త్రిలకి నాలుగు గజాల దూరంలో పసిబిడ్డ అరపువినపడింది. మంచం క్రింద దూరాడు. పాతసమస్యలు పరిష్కారం కాకుండానే మరోక్రొత్త సమస్య. తన అవస్థ వాలి అవస్థలావుంది. వాలి, తను, ఒకే నక్షత్రంలో పుట్టి వుంటారనుకున్నాడు. హంతకుడు ఎవరో పసి బిడ్డను తనరూములో హత్య చేసివుంటాడు. అవును! అదే శబ్దం! హత్యచేసినప్పుడు పసిబిడ్డలు అలాగే అరుస్తారని ఎక్కడో చదివాడు తను. మరలా గభాలున దూకినచప్పుడు. పరుగెత్తిన చప్పుడు. గట్టిగా కళ్లు మూసుకున్నాడు.

లైటు వెలిగింది. శాస్త్రిలు కళ్లుతెరచి, మూసుకుని, మరలా తెరిచాడు. గదిలో పసిబిడ్డలేదు. ఇంతకుమునుపు క్రిందపడి పగిలిపోయినవస్తువు - నీళ్ల కూజా. మంచంక్రిందికివచ్చిన నీళ్ళు ఆకూజాలోనివి. కానీ అది క్రిందపడి పగిలిపోవడానికి గలకారణం? దూకిన చప్పుడు! పరుగెత్తిన చప్పుడు! పసి బిడ్డ అరుపు! లైటు ఆరిపోయి వెలగడానికి గలకారణం! ఇవి శాస్త్రులవారి మేధస్సులో మంచుగడ్డలా ఘనీభవించి, కరగని సమస్యలు. వీటికి మూలకారణం కళ్లకి కనుపించలేదు. మెదడుకు తట్టలేదు. క్లూలు అంతకుముందే చిక్కలేదు. శాస్త్రి టైము చూసుకున్నాడు. 1–30 అయింది. శాస్త్రి ఆలోచనలతో సతమతమై పోతున్నాడు.

మరలా మానవాకారం చెప్పుల్తో నడుస్తున్న చప్పుడు. మంచంక్రింద కళ్లుమూసుకుని దాక్కున్నాడు శాస్త్రిలు. ఆ మానవాకారం తనరూములోనికి రానే వచ్చింది. చెప్పులు విడిచిపెట్టింది శాస్త్రిలకి చెమట బిందెలతో క్రుమ్మరించినట్లు కుంభపోతలా కారుతోంది. తెరవాలనుకున్న కళ్లు బరువుగా మూసుకుపోతున్నాయి. శాస్త్రి చేతిని ఎవరో పట్టుకున్నారు. గుండెలు జల్లుమన్నాయి. కళ్లు తేలబడ్డాయి. మూడుముళ్ల పిలక క్రింద మేధస్సు స్తంభించిపోయింది. ఆమెధస్సుక్రింద దాగొని దోబూచులాడుతున్న ఊహాకెరటాలు ఈ దగాలికి ఇసుక రేణువులలా ఎగిరిపోయాయి. వాలి అడుగు జాడలు కనుపించడం మానేశాయి. యుగంధర్ గుండె ధైర్యం వీపువెనకకు వెళ్లి తట్టడం ప్రారంభించింది. అశ్వద్ధామకున్నటువంటి ఏర్ కండిషన్డ్ గది అవసరంలేదిప్పుడు. అవసరమయినపుడు తూనీగలా దూసుకుపోవడానికి హిల్‌మన్ కారును గూర్చిగానీ, అది వుంచుకునేందుకు గారేజీని గూర్చిగానీ ఆలోచించేందుకు అసలు టైము లేనప్పుడు, వుల్లిపొరలాంటి చీరెలో, వెల్వేటు బ్లౌజులో, రవ్వలగాజులతో, హైహీల్డు బూట్లతో దేదీప్యమానంగా వెలిగిపోతున్న అతిలోక సుందరితో కాస్సేపయినా కులాసాగా కబుర్లాడడానికి గొంతులోనిమాటలు గొంతులోనే వుండిపోతున్నాయి. అప్పటి శాస్త్రిల అవస్థ అపరమాత్మునికెఱుక. లేకపోతే ఆగదిలోని రెండు

మంచాలకేముంది. కాకపోతే ఆ గోడగడియారాని కేముంది. ఇవేవీ కాకపోతే - శాస్త్రులవారి చెమట బొబ్బలు తడిసిముద్దయిన రంగురంగుల దుప్పటికయినా తెలియక తప్పదుకదా!

"ఒరే! అన్నయ్యా! ఏమిటిరా మంచంక్రింద దూరి తపస్సు చేస్తున్నావు?" అని శాస్త్రిని బయటకు లాగాడు రఘు.

శాస్త్రులకి సగం ధైర్యం గుండెల్లోకి వచ్చింది. తమ్ముడిని చూసి. అయినా జరిగినదంతా తమ్ముడికి చెప్పడం అవమానంగా వుండడమేకాకుండా తన అధైర్యాన్ని చాటుకోవడమే అవుతుందని తెలుసుకున్న విజ్ఞానవంతుడు కావడం మూలాన _

"ఊరికే! మంచంక్రింద నాదుప్పటి పడిపోతేనూ, తీసుకుంటున్నాను. ఇంతలో నువ్వో వచ్చేశేవు. అసలు యింతకూ నువ్వెక్కడికి వెళ్ళివస్తున్నావు?" అన్నాడు శాస్త్రులు లేచి ఒంటికయిన దుమ్ము దులుపుకుంటూ.

"సినిమాకెళ్ళివస్తున్నా! నాన్నవాళ్ళెవ్వరూ కనుక్కోలేదు కదా!" అన్నాడు రఘు బట్టలు మార్చుకుంటూ.

"లేదులే!" అన్నాడు శాస్త్రి గుండె నిబ్బరం చేసుకుని.

ఇప్పటికీ శాస్త్రికి కొన్ని చిక్కని సమస్యలు_ ఒకటి - కూజా పడి పగిలిపోవడానికి గల కారణం, రెండు-పరుగెత్తినచప్పుడు, దూకినచప్పుడు, మూడు- లైటు ఆరిపోయి, వెలగడానికిగల కారణం. నాలుగు- పసిబిడ్డ అరపు. వీటిని పరిష్కరించడానికి తన డిగ్రీ చదువు ఎందుకూ పనికిరాలేదు. తన డిటెక్టివ్ నవలాజ్ఞానం సిగదుడుచుకుపోయింది. ఇవి యిప్పటికీ రామానుజశాస్త్రులకి తీరని సమస్యలే! పాపం! ఏ ఒక్క డిటెక్టివ్ కూడా అతనికి సహాయం చేయలేదు.

అసలు జరిగింది వేరు శాస్త్రులు తన ముచ్చటైన మూడుముళ్ళ పిలకక్రింద అమోఘమైన మేధస్సు నుపయోగించి ఊహించుకున్నది మరోలా.

శాస్త్రి డిటెక్టివ్ నవలలోని క్లైమాక్సులో పడి చుట్టూవున్న ప్రపంచాన్నే మరచిపోయాడు. మళ్ళీ యీ ప్రపంచాన్ని జ్ఞాపకం చేసుకునే లోపుగానే తమ్ముడు రఘుకు సెకండు షో సినిమాకు టైము కావడం మూలాన, యింట్లోవాళ్ళను మోసపుచ్చడానికి మంచంమీద మనిషి పడుకున్నట్టే, దిండు పెట్టి, దుప్పటి కప్పి, సినిమాకు వెళ్ళిపోయాడు. టైము 11 గంటల 10 నిముషాలు. నవలలో హత్యాఘట్టం. తను అప్రయత్నంగా టైము చూసుకున్నాడు. తన టైము 11 గంటల 10 నిముషాలు. Inferiority Complex ప్రారంభమయింది. పెంకులమీద పిల్లి నడుస్తోంది. ప్రశాంతమయిన నిశీధవేళ. ఏ చిన్నశబ్దమయినా విశుద్ధంగా వినపడుతుంది. పిల్లి గోడమీదినుండి రూములోకి దూకింది. శాస్త్రి వుంటున్నవీధిలో కరెంటు సప్లై ఆగిపోయి లైట్లారిపోయి మరలా గం. 1.30 లకు వచ్చాయి. పిల్లి రూములోకి ప్రవేశించి కూజాకు తగిలి దానిని పడవేసింది. కూజా పగిలిపోయి నీళ్లు మంచంక్రిందికి చేరాయి. పిల్లి మరోపిల్లిని చూసింది. కయ్యానికి కాలందువ్వింది. దాని అరుపే పసిబిడ్డ అరపయింది. శాస్త్రులుకి లైటు వెలిగింది. పిల్లి గోడమీదికి ఎగిరిదూకి పెంకులమీద దూకి పరుగెత్తి వెళ్ళింది.

తెల్లవారింది. ఇల్లాంటిరాత్రులు ఎన్నో వచ్చాయి. పోయాయి. భూమి గుండ్రంగానే తిరుగుతోంది. కానీ శాస్త్రులకి రాత్రులు మాత్రం భూ సంచలనం ఆగిపోయినట్లుంటుంది.

---

(114-వ పేజీ తరువాయి)

"ఇటు చూడు ఆ స్టేటుమెంటు అలా వెనకపడుతోంది. అత్యవసరం కదా. ఆలస్యంచేస్తే ఎట్లా? అథారిటీ చలాయిస్తేనే కాని ఆఫీసరు అనిపించుకోడేమో?"

"ఇదుగోనండి, ఈరోజు పూర్తి చేస్తా" చేతులు నలుపుకొంటూ సీటు చేరుకొన్నాడు మాధవయ్య. సాయంత్రంలోగా తతసతాయింపులతో ఆఫీసు గొడవ తెముల్చుకొని ఇంటిముఖం పట్టాడు మాధవయ్య. ఇరకటం ఇల్లూ, ఇల్లాలు ఘోష కళ్లముందు తాండవిస్తూ ఉండడంచేత కాళ్లను కర్జన్ పార్కుకు పోనిచ్చాడు కాస్త అయినా కులాసాగా కాలక్షేపం చేద్దామని చల్లని పిల్లవాయువులు, సౌందర్యంగా అలంకరించిన రకరకాల పుష్పసముదాయము, ఆనందముగానే ఉన్నది వాతావరణం. ఆఫీసు నుండి అలసిసొలసి ఆత్రతతోపోయే జనసముదాయపు కోలాహలము చెవులను రింగుమనిపిస్తోంది. రోడ్డు మీదనుండి రివ్వునవచ్చే ధూళి నాసికారంధ్రాలలో జొరపడుతోంది. ప్రశాంతత లేని పార్కుల ప్రయోజనమేమి, అని పలవరించే ప్రజలు లేకపోలేదు.

సంధ్యారాగములు అల్లుకొన్నవి రంగు రంగుల కాంతి దీపములు వింత వెలుగులు వెదజల్లుతున్నాయి. అక్కడక్కడ కార్పొరేషను దీపములు కునికిపోవుటచేత రాత్రి బాగానే అయినట్లు తెలుస్తోంది. రాత్రించరులు రోడ్డుమీద పోతున్నారు. జటపటాలు వేసుకుపోయే జంట పక్షులు,— భార్యాభర్తలు కావచ్చు - లేదా ప్రేమికులు కావచ్చు. కొంత దూరంలో కుతూహలంగా చూచే కమలాక్షులు, వాళ్ల ప్రక్కగా రయమునపోయే లెక్కలేని రోమియోలు, రకరకాలుగా రక్తి కలిగించే రేయి మాధవయ్యను కూడ రవంత రేకెత్తించింది అంటే అతిశయోక్తి లేదు. హైహీల్డు (High healed) అమ్మాయి అంతేదో కనుక్కొందామని ఆమె ప్రక్కనే నడుస్తూ, ఆమె అమాంతంగా ఆటోమేటిక్ టెలిఫోను ఆఫీసులో ప్రవేశించేటప్పటికి, మేలుకొని మాడిన ముఖంతో మరలిపోయాడు మాధవయ్య! యత్నించి యత్నించి ఆరుమైళ్ల దూరంలో ఉన్న ఇల్లు చేరుకొన్నాడు, బస్సులో వ్రేళ్లాడుతూ.

"నాన్నగారూ, పచ్చడిలో ఉప్పు వేసానో లేదో చూడండి!" అం పదేళ్ల పసిబిడ్డ పచ్చడి చేతిలో పెట్టింది

దినపత్రిక చదువుతూ దూరంలో కూర్చున్న 'గృహలక్ష్మిని' చూడగానే దిగాలుమన్నాడు మాధవయ్య.

"నెల ముందు అని తెలిసికూడ ఇంత ఆలస్యంచేస్తే ఎట్లా అండీ చంటిపిల్ల ఏమి చేయగలదు, అంత వంటాను".

ఇది నిత్యగోల కాదన్నమాట - నెల గోల, మూలుగుకొంటూ మాధవయ్య ముందున్న మూడురోజులు మరీ తలచుకొంటూ మొగము వాల్చాడు.

# బుద్ధావతారము

శ్రీ పేరి సర్వేశ్వరశర్మ

ప్రపంచంలో హింస పరాకాష్ఠకు చెంది ధర్మం పేరిట అశ్వమేధాలే కాకుండ నరమేధాలు జరుగుతున్న రోజాలలో సమాజాన్ని సన్మార్గములోనికి తీసుకొని వచ్చుటకై బుదభగవానుడు అవతరించాడు. క్రీస్తుకు పూర్వము 448 సం॥లో వైశాఖ పూర్ణిమనాడు హిమాంశువు పదహారు కళలతోను నిండుగా ఉదయించి ఆతప సంతప్తమైన చరాచర జగత్తును తన శీతకిరణాలతో చల్లబరచుచున్న సమయములో శాక్యవంశపు రాజయిన శుద్ధోధనుని పట్టమహిషియైన మాయాదేవి గర్భమున గౌతముడను బాలకుడు ఉదయించాడు. అనపత్యులైన దంపతుల అనందానికి మేరలేదు. జ్యోతిష్కులంతా చేరి ఈ బాలకుడు సాగరమేఖలయైన ధరణీచక్రాన్ని ఏలనైనా ఏలుతాడు లేదా సన్యాసియై నూతన మతప్రవర్తకుడై జగద్విఖ్యాతుడైనా అవుతాడు అని చెప్పారు. ఆ రాజదంపతులకు జ్యోతిష్కుల మాటలవలన అనందము, ఆవేదన రెండు ఒక్కసారిగ కలిగినాయి. తమ బాలకుడు సప్తద్వీపమైన మహమతికి ఏకచ్ఛత్రాధిపతి అవుతాడంటే ఏ దంపతుల కళ్లనుండి అనందబాష్పాలు స్రవించవు. అదే లేకలేక కలిగిన కొడుకు సన్యాసియై ఇల్లు విడచి పోతాడంటే జననీజనకులకు గల్గు ఆవేదన అంతు ఉండునా. వారి కన్నీరు వారిధి కాదా.

శుద్ధోదనుడు శుక్లపక్షపు చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుడగు గౌతమునకు ఏ సమయములోను కూడ వైరాగ్యభావము కలుగకుండుటకై అంతఃపురాలలో అంతట ఆనందమయమైన వాతావరణాన్ని ఏర్పరచినాడు. ఎచ్చటచూచినా రమ్యమైన దృశ్యాలే. కాని బుద్ధభగవానుని ఆ దృశ్యాలేమీ ఆకర్షించలేదు. బాల్యమునుండి ఆయన మనస్సులో ఒక విధమైన వైరాగ్యభావ మంకురించి క్రమముగా పెరిగి మహావృక్షమై పుష్పించి ఫలించింది. ఆ ఫలాలను తను ఆస్వాదించుటే కాకుండ మానవ సమాజానికంతకి కూడ వాటి మధుర రసాన్ని పంచిపెట్టినాడు గౌతమబుద్ధుడు. అందుకొరకే ఆయన అవతరించాడు. చిన్నతనమునుండియే ఆయన పట్టణము చూచుటకు వెళ్లునపుడు కుష్ఠురోగులను, ముసలివాళ్లను చూచి తన సారధిని వారికి కుష్ఠురోగము, ముసలితనము ఎట్లా వచ్చింది, ఎందుకు వచ్చింది అని ప్రశ్నలు వేయుచుండెడివాడు. సారధి గౌతముని ప్రశ్నలకు సమాధానం చెప్పక వాని దృష్టిని మరల్చుటకై ఏవో రమ్యమైన దృశ్యాలు ఆయనకు చూపుతూ ఉండేవాడు. గౌతమునకు తరుణ వయసులోనే వివాహం అయింది. ఆయన భార్య యశోధర. గౌతముడు 19వ సంవత్సరముననే నవజాత శిశువును, భార్య ప్రేమను మహాసామ్రాజ్యాన్ని విడచి సత్యాన్వేషణకై బయలుదేరాడు. సాంఖ్యోపదేశకులైన ఆరాడ్ కాలాము వలన తత్త్వబోధలు విన్నాడు. కాని దానితో ఆయనకు తృప్తి తీరలేదు. చాలమంది గురువులను ఆశ్రయించి చాల ఉపదేశాలు విన్నాడు. వాటివల్లకూడ ఆయనకు తృప్తి కలుగలేదు. ఆయన అన్వేషణను సాగిస్తూనే వచ్చాడు. నిరంతరము ఆయన చేసిన సత్యాన్వేషణ ఫలితముగా 25 సంవత్సరాల వయసులో ఆయనకు "ఉరవేల" మనుచోట నాలుగు ఆర్యసత్యముల ప్రత్యక్ష అనుభూతి కల్గింది. వైశాఖ పూర్ణిమనాడు గౌతముడు బుద్ధత్వము (జ్ఞానము)ను పొందాడు. నాటినుండి ఆయన గౌతమ బుద్ధుడయ్యాడు. ఆయన ప్రచారంలోనికి తీసుకొనివచ్చిన మతం బౌద్ధమతం అయ్యింది. గౌతమబుద్ధుడు తెలుసుకొనిన నాలుగు ఆర్యసత్యాలు ఏవి అంటే, (1) ఈ ప్రపంచములో జీవితము దుఃఖమయము; (2) దుఃఖములకు కారణాలు ఉన్నవి; (3) ఈ దుఃఖములను నిర్మూలించవచ్చును; (4) ఈ దుఃఖ నిర్మూలనకు సరియైన ఉపాయమున్నది. గౌతమబుద్ధుడు తెలుసుకున్న సత్యాలు అనంతములైనప్పటికీ వాటిలో ఈ నాలుగు ముఖ్యములు గావున ఈ నాల్గింటికీ ఆరసత్యములని పేరు వచ్చింది.

గౌతముడు బుద్ధత్వాన్ని పొందినపిదప సారనాధులో ఆయన శిష్యులలో మొదటి పంచవర్గుకు చెందిన అయిదుగురు భిక్షువులకు మొదటి ఉపదేశం చేసి ధర్మచక్రాన్ని ప్రవర్తింపజేశాడు. ఆయన శాక్యగణానికి చెందినవాడు కావున దాని ఆదర్శము

పైన భిక్షు సంఘాన్ని నెలకొల్పాడు. ఆ కాలములో జనసామాన్యుల భాష మాగధీ భాష అగుటచే ఆ భాషలోనే తన ఉపదేశాలన్నీ చేసాడు. ఈ విధముగ తన మతాన్ని ప్రవర్తింపజేసి 80 సంవత్సరాల వయసులో వైశాఖ పూర్ణిమనాడు కుశీనగరములో (కసయా, గోరఖ్‌పూర్ జిల్లా, ఉత్తరప్రదేశ్) నిర్వాణం పొందాడు.

గౌతమబుద్ధుని పుట్టుక, బుద్ధత్వప్రాప్తి, నిర్వాణము మూడు వైశాఖ పూర్ణిమనాడే జరిగాయి. కావున బౌద్ధమతస్థులకు వైశాఖపూర్ణిమ మహాపర్వదినము.

బుద్ధభగవానుడు తన ఉపదేశాలను ఎవరిచేతను వ్రాయించలేదు. ఆయన నిర్వాణమువరకు ఆయన ఉపదేశాలన్నీ మౌఖికంగానే ఉండేవి. బుద్ధుని నిర్వాణానంతరం ఆయన ఉపదేశాలు చిరస్థాయిగా ఉండుటకై రాజగృహములో మహాకశ్యపుని అధ్యక్షతన బౌద్ధ భిక్షువుల మహాసభ జరిగింది. ఆ సభలో బుద్ధునిపట్ట శిష్యుడైన 'ఆనందు'ని సహకారముతో "సుత్తపిటక" మను గ్రంథము, "ఉపాలి" అనువాని సహకారమువలన "వినయపిటక" మను గ్రంథము రచింపబడినాయి. తర్వాత 'సుత్తపిటకా'నికి శాఖగా 'అభిదమ్మపిటక' మనే గ్రంథంకూడ రచింపబడింది. "సుత్తపిటకము" (బుద్ధుని ఉపదేశాల సంగ్రహము), "వినయపిటకము" (ఆచారానికి సంబంధించిన గ్రంథము), అభిధర్మ పిటకము, (దార్శనిక సిద్ధాంతాలకు సంబంధించిన గ్రంథము) ఈ మూడు బౌద్ధమతానికి మూలస్తంభాలు. బుద్ధభగవానుడు అధ్యాత్మ శాస్త్రానికి సంబంధించిన చిక్కులను వాదోపవాదాల ద్వారాను, తర్కవితర్కాల ద్వారాను విడతియ్యటానికి ప్రయత్నించక దుఃఖ బహుళమైన యీ ప్రపంచంనుండి తరించుటకు సదాచార మార్గాన్ని ప్రబోధించాడు. సభలలో శిష్యులు ఆధ్యాత్మిక విషయాలపైన ప్రశ్నలడిగినప్పుడు గౌతమబుద్ధుడు సమాధానం చెప్పక ఊరక ఉండేవాడు. చాలసార్లు ఆయన శిష్యులను "అతిప్రశ్న"లు అడగవద్దని నిషేధించినట్లు కూడ "నికాయాల"లో కనపడుతుంది. శ్రావస్తీ నగరంలో జేతవనమునందు బుద్ధభగవానుడు విహారం చేస్తున్న సమయంలో "మాలుంక్యపుత్త" అనే శిష్యుడు (సుత్తపిటకములోని రెంగవ అధ్యాయం మజ్ఝిమనికాయం చూడండి) ఈ జగత్తు, శాశ్వతమా, అశాశ్వతమా, దీనికి అంతమున్నదా, లేదా జీవుడు శరీరంకంటె వేరు అవునా కాదా, అని పది మేందక ప్రశ్నలు బుద్ధభగవానుని అడిగాడు, కాని వాటికి బుద్ధభగవానుడు సమాధానం చెప్పలేదు. వాటివల్ల ఆచారమార్గానికి సంబంధించిన వైరాగ్యము, ఉపశమము, అభిజ్ఞా, సంబోధి, నిర్వాణం మున్నగు కలుగవు కావున వాటికి సమాధానం చెప్పవలసినవసరం లేదు అని అన్నాడు. ఈ సందర్భంలో ఆయన చక్కటి దృష్టాంతం యిచ్చాడు. ఒక వ్యక్తి విషం పూసిన బాణం దెబ్బతిని బాధపడుతున్నా డనుకుందాం. అట్టి స్థితిలో వాని బంధువులు వాని బాధ నివృత్తికై విషవైద్యుని తీసుకొని వద్దామని అనుకుంటున్నారనుకోండి. అలాటప్పుడు ఆ వైద్యుని పేరు ఏమిటి? గోత్రమేమిటి? అతడు అందంగా ఉంటాడా ఉండడా? అతడు నల్లగా ఉంటాడా, తెల్లగా ఉంటాడా అని ఆ బాధపడుతున్నవాడు అడుగుతే అతడు తెలివి తక్కువవాడు అవునా? కాదా? ప్రపంచ దుఃఖాలవల్ల బాధపడుతూ ఉండే ప్రాణికోటి పరిస్థితికూడ అంతే. వారికి ఉద్ధార మార్గమేదో కావాలికాని అధ్యాత్మ విషయకమైన తర్కవితర్కాలతో వారికి పనియేమి? వారు తెలుసుకోవలసినది, సదాచార మార్గమే. ఈ సదాచారానికి సంబంధించినవే పై నాలుగు "ఆర్య సత్యాలు"న్నూ. వాటిలో మొదటిది దుఃఖము. ఈ ప్రపంచము దుఃఖబహుళమన్న విషయాన్ని ఎవరూ నిరాకరించరు. అది ప్రత్యక్ష అనుభవసిద్ధము. రెండవది దుఃఖానికి కారణాలు. ఈ ప్రపంచ దుఃఖానికి ఒకటి కాదు, చాల కారణాలు ఉన్నవి. ఈ కారణపరంపరకు బౌద్ధదర్శనంలో "ద్వాదశ నిదానములు" అని పేరు, అవి (1) జరామరణములు; (2) జాతి; (3) భవము; (4) ఉపాదానము; (5) తృష్ణ; (6) వేదన; (7) స్పర్శ; (8) షడాయతనములు; (9) నామరూపములు; (10) విజ్ఞానము; (11) సంస్కారము; (12) అవిద్య.

ఈ పన్నెండింటిలో ముందువాటికి వెనుకవి కారణములు. జరామరణములకు కారణము జాతి. జాతి అనగా పుట్టుక అని అర్థము. పుట్టుకకు కారణము భవము. భవమనగా మరల పుట్టుకకు కారణభూతమైన కర్మ. ఈ కర్మకు కారణము ఉపాదానము. ఉపాదానమనగా ఆసక్తి అని అర్థము. ఆసక్తివల్ల కర్మ పుట్టుతుంది. ఈ ఆసక్తి అన్నది

అనేకవిధాలుగా ఉంటుంది. ఉదాహరణకు, కామోపాదానము (అంటే స్త్రీయందు ఆసక్తి) శీలోపాదానము (వ్రతములు చేయుటయందు ఆసక్తి) అట్లనే క్రీడోపాదానము అన్నామంటే (ఆటయందు ఆసక్తి అన్నమాట). ఈ విధంగా లక్షలకొలది ఉపాదానాలు ఉంటాయి. ఆ ఉపాదానాల బట్టియే మనం కర్మకూడ చేస్తూ ఉంటాము. ఈ ఆసక్తి అన్నది తృష్ణవల్ల పుట్టుతుంది. తృష్ణ అంటే కోరిక అని అర్థము. తృష్ణకు కారణము వేదన. వేదన అంటే ఇంద్రియములవల్ల కలుగు అనుభూతి అని అర్థము. ఇంద్రియాలు పది. అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు. త్వక్, నేత్ర, శ్రోత్ర, రసన, ఘ్రాణేంద్రియాలు అయిదు జ్ఞానేంద్రియాలు. త్వక్ (చర్మము) చే స్పర్శజ్ఞానము, నేత్రము చే (కన్ను) రూపజ్ఞానము, శ్రోత్రము చే (చెవి) శబ్దజ్ఞానము, రసనచే (నాలుక) రసజ్ఞానము, ఘ్రాణముచే (ముక్కు), గంధజ్ఞానము మనకు కలుగుచున్నది.

వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు అయిదు కర్మేంద్రియములు. వాగింద్రియముచే మనము మాట్లాడగలుగుతున్నాము. పాణి అంటే చెయ్యి. చేతులతో మనము పనులు చేయుచున్నాము. పాదము అంటే కాలు. కాళ్లతో మనము నడచుట, పరిగెత్తుట చేయుచున్నాము. పాయు అంటే పురుష లింగము. ఉపస్థ అంటే స్త్రీ లింగము.

వీటిలో జ్ఞానేంద్రియములు ప్రధానములు. ఎందుకనగా జ్ఞానేంద్రియముల ద్వారా బాహ్యరాన్న భూతి కలిగినప్పుడు గదా మనుష్యుడు కర్మలందు ప్రవృత్తుడగుట. ఈ విధముగా తృష్ణకు కారణము వేదన అయినది. వేదనకు కారణము స్పర్శ. స్పర్శ అనగా విషయేంద్రియ సంపర్కము. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు విషయములు. త్వక్ చక్షుః శ్రోత్ర; రసన, ఘ్రాణేంద్రియాదులు ఇంద్రియములు. విషయములకు, ఇంద్రియములకు గలుగు సంపర్కమే స్పర్శ. ఈ స్పర్శకు కారణము షడాయతనములు. మనస్సు, అయిదు జ్ఞానేంద్రియములు కలసి షడాయతనములని చెప్పబడుచున్నవి. ఈ ఆరు ఆయతనములకు కారణము నామరూపములు. నామరూపములనగా మన కగపడు శరీరము దాని సంజ్ఞ. నామరూపములకు కారణము విజ్ఞానము. విజ్ఞానమనగా చైతన్యమని అర్థము. ఈ చైతన్యధార మాతృగర్భములోని పిండముయొక్క నామరూపములకు సాధకము. విజ్ఞానమునకు కారణము సంస్కారము. సంస్కారమనగా పూర్వజన్మలందలి కర్మలవల్ల అనుభవములవల్ల కలిగిన సంస్కారము. ఈ సంస్కారమునకు కారణము అవిద్య. ఈవిధంగా సమస్త దుఃఖాలకు ఆదికారణము అవిద్య. ఈ పన్నెండు నిదానాలను "భవచక్ర"మని కూడ పేరు ఉన్నది. ఈ భవచక్రానికి జరుగుచున్న జన్మతోను, జరిగిన జన్మతోను, జరగబోయే జన్మతోను కూడ సంబంధమున్నది.

అవిద్య, సంస్కారము అను మొదటి రెండు కారణాలు జరిగిన జన్మతో సంబంధించినవి. విజ్ఞానము, నామరూపములు, షడాయతనములు, స్పర్శ, వేదన, తృష్ణ, ఉపాదానము, భవము, అను తరువాతి ఎనిమిది కారణములు జరుగుచున్న జన్మతో సంబంధించినవి. జాతి, జరామరణములు అను తరువాతి రెండు కారణములు జరుగబోవు జన్మతో సంబంధించినవి. ఇంతటితో రెండవ ఆర్యసత్యమైన దుఃఖపుంజముయొక్క వివరణ పూర్తి అయింది.

(సశేషము)

---



---

ముఖచిత్రము :
జెమినీ వారి తమిళ చిత్రం
'ఇనుప తెర' లో
వైజయంతిమాల




సారథి ప్రొడక్షన్స్‌వారి 'కాళిదాసు' చిత్ర నిర్మాణము పూర్తయి మార్చి 25న విడుదల కాగలదు. నిర్మాతలు కె. నాగమణి, పి. సూరిబాబుగారలు, దర్శకులు కే. కామేశ్వరరావుగారు. ఈ చిత్రము సాహిత్యాభిరుచితో క్రొత్త పంథాలో సర్వజనరంజకంగా నుండేలాగున తయారయిందనుకొంటున్నారు.

♦ ♦ ♦

సుప్రసిద్ధ సినీడైరక్టరు శ్రీ తాతినేని ప్రకాశరావు త్యాగరాయనగరులో స్వంత భవనము నిర్మించుకొని ఫిబ్రవరి 15వ తేదిన గృహప్రవేశము జరుపుకున్నారు. ఈ సందర్భమున నృత్య ప్రదర్శనము, నాజర్ బుర్రకథ, విందు జరిగాయి. తెలుగు, తమిళ, హిందీ చిత్ర నిర్మాతలు, దర్శకులు, నటీనటులు, డిస్ట్రిబ్యూటర్లు, ఎక్జిబిటర్లు అనేకులు వచ్చి అభినందించి కట్నాలు చదివించారు.

♦ ♦ ♦

మాడరన్ థియేటర్స్‌వారి 'అపూర్వచింతామణి' యీనెల 25వ తేదీన విడుదల కాబోతున్నది.

♦ ♦ ♦

రవుతూ పిక్చర్స్‌వారి 'నిత్యకల్యాణం పచ్చతోరణం' ఉత్తమ చిత్రాలలో నొకటి యనియు, యిందులో సి.యస్.ఆర్. కడుసమర్థంగా నటించాడనియు వార్తలు. ఇందులో నాయకీ నాయకులు కృష్ణకుమారి, చలం.

♦ ♦ ♦

వరలక్ష్మి పిక్చర్స్‌వారి 'ధర్మమేజయం' చిత్రం విడుదలకు సిద్ధంగా నున్నది. ఇందులో జమున, కన్నాంబ, జగ్గయ్య, రేలంగి, గిరిజ మొదలగువారు నటించారు. దర్శకత్వం శ్రీ కె. బి. నాగభూషణంగారిది. ఈ చిత్రము ప్రజలను అన్నివిధాల ఆకర్షించగలదని అంటున్నారు.

♦ ♦ ♦

అమెరికాలో దేశవ్యాప్తంగా ప్రభుత్వ పాఠశాలలలో అధ్యాపకులతో నిమిత్తములేకుండా వచ్చే శరత్కాలంలో 10వ తరగతికి బయాలజీని బోధించుటకు నూతన విధానమును ప్రవేశపెట్టబోతున్నారు.

ఈ పాఠ్యక్రమంలో అమెరికన్ బయోలాజికల్ సైన్సు ఇన్స్టిట్యూట్ నిర్మించిన 120 చలన చిత్రాలను వినియోగిస్తారు. ఒక్కొక్క చిత్ర ప్రదర్శన కాలం అరగంట. ఈ విద్యాబోధన మూల విరాట్ డాక్టరు H. బర్నీ యీ పద్ధతివల్ల విద్యార్థులు పాఠాలను సులభంగాను, ఎక్కువ శ్రద్ధగాను నేర్చుకో కలుగుతారన్నారు.

♦ ♦ ♦

చిత్ర సమీక్ష

## రాజమకుటం

వాహినీవారి 'రాజమకుటం' చిత్రము విడుదల అయి యావదాంధ్ర దేశంలో ఉత్తమ చిత్రంగా మన్ననల నందుకుంటున్నది. ఇది జానపద చిత్రాలలో నొక కళాఖండము. ఈ చిత్రపుకథ ప్రేక్షకులలో ఆసక్తితో బాటు పటుతరంగా నొప్పుచు సులభంగా అర్థమయ్యేటట్లున్నది. శ్రీ బి. యన్. రెడ్డిగారి విశిష్టమైన దర్శకత్వానికి చిత్రము మరొక మచ్చుతునక.

జానపద చిత్రమయినా యిందులో నిరంకుశత్వాన్ని, దుర్మార్గాన్ని ఎదిరించడానికి ప్రజలలో చైతన్యమెలా పూరించబడాలో, స్వాతంత్ర్య రక్షణకు ఎట్టి పట్టుదల, కార్యదీక్ష అవసరమో ప్రబోధిస్తున్నది.

గుమ్మడి, రామారావు, కన్నాంబ, రాజసులోచన, రాజనాల సమర్థంగా నటించారు. దేవులపల్లి కృష్ణశాస్త్రి, కొసరాజు, నాగరాజు పాటలు, డి. నరసరాజుగారి మాటలు కథా సాహిత్యానికి వన్నె తెచ్చాయి.

కళా దర్శకత్వము, ఫొటోగ్రఫీ, సంగీత దర్శకత్వము ఉత్తమస్థాయి నందుకున్నవి. రెండు మూడు పాటలు విశేషంగా ప్రచారంలోకి రాగలవు.

జానపద చిత్రం కాబట్టి జనసామాన్యాన్ని ఆకర్షించే హంగులన్నీ యిందులో పొందుపరచబడ్డవి. ఈ చిత్రనిర్మాణంలో శ్రీ బి. యన్. రెడ్డిగారి కృషి అమోఘమైనది, అద్వితీయమైనది కూడాను. ఈ చిత్రము విజయయాత్ర సాగిస్తుందనటంలో విశేషము ఏమీ లేదు.

—పున్నయ్య




**విద్యార్థి వ్యాసమంజూష :** విద్వాన్ కే. సంజీవరాయశర్మ. ప్రచురణకర్తలు 'ఉదయరంజని పబ్లిషర్స్,' C/o వి. వి. కే. శర్మ, 66 సామిపిళ్లై వీధి, చూళై, మద్రాసు 7. వెల 85 న. పై.

ఇది విద్యార్థులు వ్యాసరచన కలవడుటకనువుగా 30 శీర్షికలు పొందుపరచబడిన పుస్తకము. ఇందలి విషయములు పరీక్షల దృష్ట్యా మాత్రమేకాక లోకజ్ఞానమును సయితము సమకూర్చగలవు. విద్యార్థులకీ పుస్తకము నిర్ణీతవిషయములనుగురించి వ్యాసములు వ్రాయుట కలవాటుపడుటకు తోడ్పడును.

**యాత్రామార్గ దర్శి :** శ్రీ రాగం వెంకటేశ్వర్లు. ప్రకాశకులు : శ్రీ సీతారామ నామ సంకీర్తన సంఘము (రిజిష్టర్డు); శ్రీ రామనామ క్షేత్రము, గుంటూరు 1. వెల రు. 1 మాత్రం.

హిమాచల యాత్రా మార్గదర్శిగా రూపొందిన యీ పుస్తకములో కాశ్మీరు, కైలాస, యమునోత్తరి, గంగోత్తరి, బదరి, కేదారప్రాంతముల వివరణ యాత్రికులకు బహుళోపయుక్తముగా నుండునట్లు కలదు. హిమాలయ ప్రాంతమున యాత్రల కరుగువారికి అవసరమైన సూచనలతో, క్షేత్ర, మార్గముల వర్ణనలు, వివరములతో నొప్పుచున్న యీ పుస్తకము అమూల్యమైనది.

**'దేవదత్తం' సచిత్ర వారపత్రిక** ప్రథమసంచిక నుండి మా కార్యాలయమునకు వచ్చుచున్నది. సంపాదకులు శ్రీ కే. సభా, కార్యస్థానము : చిత్తూరు.

ఈ కాలంలో పత్రికా నిర్వహణ వ్యయ ప్రయాసలతో కూడినదైనను శ్రీ సభాగారు సాహిత్య పరిజ్ఞానమును అధ్యాత్మిక వికాసమునకు, నైతిక ప్రబోధమునకు, అజ్ఞాననిర్మూలనమునకు వినియోగించే మహాదాశయముతో యీ పత్రిక నిర్వహణకు పూనుకున్నారు. తన అనుభవసామర్థ్యాలను వినియోగించి యీ పత్రికను సర్వాంగ సుందరముగా విజ్ఞానంతో బాటు వినోదముతో ఆకర్షణీయంగా రూపొందిస్తున్నందుకు సంపాదకులు అభినందనీయులు. సంవత్సరచందా రు. 10 – లు. అర్ధ సంవత్సర చందా రు. 5/–లు. శాశ్వత చందా రు. 116/లు. విడిప్రతిక 20 న. పై. లు.

**క్రోధం :** సెవరినా స్మాగ్రెవ్ స్కా. ప్రచురణకర్తలు : నవోదయ పబ్లిషర్స్, గుడివాడ. వెల రు 1/–.

రెండవ ప్రపంచయుద్ధకాలంలో నాజీలు కొనసాగించిన కిరాతకాన్ని, అఘాయిత్యాన్ని, దోపిడిని యీ గ్రంధములో కనులకు కట్టినట్లు చిత్రించడానికి ప్రయత్నముజరిగింది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల నుద్దేశించి జర్మను ఆక్రమిత ప్రాంతాలు - పోలెండులాంటి దేశప్రజలు సాగించిన వీరోచిత పోరాటము, లక్ష్యసాధనకుగాను వారుచేసిన త్యాగాలు, పడిన కష్టాలు పాఠకులకు గగుర్పాటుకలిగిస్తాయి. శ్రీ కొండెపూడి శ్రీనివాసరావుగారు సమర్థంగా అనువదించారు.

# సంపాదకీయములు

## విశ్వవిద్యాలయాలలో ప్రవేశం

శ్రీ చింతామణి దేశముఖ్ గారి అధ్యక్షతన విశ్వవిద్యాలయాల గ్రాంట్ల సంఘము, అర్హత, అభిరుచి యున్నవారికి మాత్రమే విశ్వవిద్యాలయాలలో ప్రవేశం కల్పించాలని ప్రభుత్వమునకు సూచించింది. ఇందుకుగాను ఏదో రకమైన పరీక్షద్వారా ధృవపడినవారికి మాత్రమే అవకాశాలు పరిమితంచేసి అట్టివారి నుండియే ఉన్నత విద్యాప్రమాణాలు కలిగి, దేశమునకు అవసరమైన విభిన్న వృత్తులు, సర్వీసులు నిర్వహించ దగినవారిని ఎన్నిక చేయాలనే అభిప్రాయమును విశ్వవిద్యాలయాల విరాళాల సంఘము వ్యక్తము చేసింది.

ఈ సూచన చాల అమూల్యమైనది. అర్హతలు, అభిరుచులకు ప్రాధాన్యమిచ్చినచో ఉన్నత విద్యా ప్రమాణములతోబాటు శక్తిసామర్థ్యములు గలవారు విశ్వవిద్యాలయములలో సుశిక్షితులై దేశానికి, సంఘానికి కూడ అనేకవిధాల ఉపయోగపడగలరు.

ఈ సందర్భమున ఆంధ్ర ఆరోగ్య మంత్రి శ్రీ సి. వి. జి. రాజు తెలివిగల విద్యార్థులకే వైద్య కళాశాలలలో ప్రవేశం కల్పించాలనియు, కులాల ప్రాతిపదికమీద తగదని చేసిన సూచన గమనించతగినది.

వెనుకబడిన కులాలకు, బీదలకు విద్యావసతులైతే విస్తృతంచేసి కల్పించవచ్చును కాని కులాలకు, వర్గాలకు ప్రాధాన్యమిస్తూ తెలివితేటలను, శక్తిసామర్థ్యాలను, అర్హతలను త్రోసిపుచ్చినచో ఏ రంగంలోను ఉత్తమస్థాయి సమకూరదు.

## పరిశ్రమలు

ఆంధ్ర ప్రదేశ్ భవిష్యత్తులో పారిశ్రామిక అభివృద్ధిపట్ల ఆసక్తిని చూపనున్న సందర్భమున సాధ్యమైనంతవరకు గ్రామీణప్రాంతాలు కేంద్రాలుగా ఎన్నుకోబడటం వాంఛనీయము.

ఏ పరిశ్రమ అయినా ప్రజలకు పనిని కల్పించి, దానికితగిన ప్రతిఫలమును సమకూర్చేదిగా నుండాలి. ప్రజలయొక్క, దేశంయొక్క సౌభాగ్యమును రూపొందించే పరిశ్రమల విస్తరణకు ప్రజలయొక్క, ప్రభుత్వముయొక్క సహాయ సహకారములు లభించగలవని ఆశిద్దాం!

## లలిత కళలకు ప్రత్యేక మంత్రి అవసరమా?

మానవ జీవితముమీద లలితకళల ప్రభావము విశేషమైనది. సుఖ సౌభాగ్యాలకు, ఆనందానికి లలిత కళలు సర్వతోముఖంగా తోడ్పడుతవి. అందుకుగాను ప్రజలలో కళాపిపాస వర్ధిల్లాలి. కళాకారుల రూపొందించుటకు కళాకేంద్రాలు ఏర్పడటంతోబాటు కళల పోషణకు అవకాశాలు విస్తృతం కావాలి. ఇది ప్రభుత్వముయొక్క నిర్వహణతో మాత్రము సాధించకలుగుతామనే అభిప్రాయము సరిగాదు ప్రజలు ఆసక్తితో కళల అభివృద్ధికి ప్రభుత్వముతో సహకరించి తోడ్పడాలి. కళాకేంద్రాలు, ప్రదర్శనశాలలు విస్తృతమై, కళలు, సంగీతము, నృత్యము, చిత్రలేఖనము మొదలైనవి ప్రతి యొక్కరికి అందుబాటులోనికి వచ్చినప్పుడు కళలు అవిచ్ఛిన్నముగా వర్ధిల్లగలవు.

అట్టి అభివృద్ధికి ప్రత్యేకంగా మంత్రి అవసరమనిపించదు. విద్యాశాఖ మంత్రియే లలితకళల శాఖను కూడ నిర్వహించవచ్చును. ప్రత్యేకంగా మంత్రి ఏర్పడినందువల్ల విశేషంగా ఏర్పడనున్న లలితకళల యభివృద్ధి యుండదు. ఈనాడు ప్రత్యేక మంత్రులున్నా కొన్ని రంగాల యభివృద్ధి చెప్పుకోతగినది కనుపించుటలేదు. పైగా అనవసర డబ్బుఖర్చు కూడాను.

---

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

